26.4.1996 శుక్రవారం 12 పేజీలు సంపుటి:68 సంచిక:17 విడిప్రతి రూ. 2.00 లు Phone: 27354 Regd. No. HNL 18

# జమీన్ రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి



## చంద్రబాబుకు కొనవూపిరి-లక్ష్మిపార్వతిది ఆత్మహత్యే!

# కాంగ్రెస్‌కు ప్రాణ ప్రతిష్ఠ!

**మా ప్రత్యేక విలేఖరి**

రాష్ట్రంలో ఎన్నికల వాతావరణం కాంగ్రెస్ కు అనుకూలంగా మారే అవకాశం వుందని గత వారమే సూచించాము. అది వట్టి సూచన కాదని, గట్టి వాస్తవమని చెప్పనమ్ము. రాయల సీమ, తెలంగాణా, కోస్తా జిల్లాలనే తేడా లేకుండా యావదాంధ్ర దేశంలో హస్తం గాలి జోరుగా వీస్తూంది. పదహారు నెలల క్రితం జరిగిన అసెంబ్లీ ఎన్నికలకు ఇప్పటికి ఇంత తేడా రావడానికి ప్రధాన కారణం తెలుగు దేశం చీలిక! ఎన్టీఆర్ పై నమ్మకంతో, విశ్వాసంతో, మోజుతో, అభిమానంతో తెలుగు దేశం పార్టీకి బ్రహ్మరథం పట్టిన ప్రజలు; అత్తా, అల్లుళ్ల కీచులాటలను అసహ్యించు కొంటున్నారు. అందువల్లే కాంగ్రెస్ పరిస్థితి మెరుగు పడింది.

కేవలం 5 శాతం ఓట్లు కాంగ్రెస్ వైపు స్వింగ్ అయినా గెల్చే సీట్లలో చాలా మార్పు వస్తుంది. అయితే ఈ సానుకూలత 5 శాతం కంటే చాలా హెచ్చుగా వుండ వచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు. ఉభయ తెలుగు దేశం పార్టీలలో ఏది అసలు, ఏది నకిలీలన్న విషయం ఓటరుకు బోధ పడక పోవడం చాలా ప్రధానమైన పరిణామం. లక్ష్మీపార్వతి సభలకు విశేషంగా హాజరు కావడం ద్వారా ఆమెను వారసు రాలిగా అంగీక రించినట్లు కన్పించారు జనం. కాని ఆమె ఆ జనాదరణను నిలుపు కోలేక పోతున్నది. తనను చూడడానికి వచ్చే జన సందోహమే తనకు ఓట్లు రాశి పోస్తారని భావించారామె. అయితే దాన్ని వ్యవస్థీకృతం చేసి, బ్యాలెట్ పెట్టెలు నింపు కోవడానికి చాలా పెద్ద యంత్రాంగం కావాలన్న విషయం మర్చి పోయారు. టిక్కెట్ల పంపకంలో, ప్రచార విషయంలో, వనరుల కల్పనలో తన మాటే చెల్లుబాటు కావాలనే మూర్ఖత్వ ... ఇతరుల సలహాలు తిరస్కరించి, అందర్నీ దూరం చేసుకొని రాజకీయంగా ఆత్మహత్య చేసు కున్నారామె. ఆమె అభ్యర్థులు పలు చోట్ల అనాథలై పోయారు. వారికి కార్యకర్తలు, నాయకులు లేకుండా పోయారు. పార్టీ పరంగా నిధులు, ప్రచార సామగ్రి, పత్రికా ప్రకటనల వంటివి అందలేదు. ప్రచారంలో బాగా వెనుకబడి పోయారు. ఆ బలహీనతతో ఆయా అభ్యర్థులు ఓడి పోబోతున్నారనే ప్రచారానికి ఆస్కారం కల్పించారు. ఇది ఓటరును విపరీతంగా ప్రభావితం చేసే అంశం. ఓడే అభ్యర్థికి ఓట్లు ఎందుకన్న వాదనతో ఆమె బలం దిన దినానికీ తరిగి పోతున్నది. రాజకీయ అజ్ఞానంతో, రాజకీయ ఆత్మహత్యకు పాల్పడి నారామె.

ఈ పరిణతి చంద్రబాబుకు వూపిరి పోసింది. రాజకీయంగా ప్రచారం యంత్రాంగం ప్రొఫెషనల్ మెషినరీలు ఎంత వుపకరిస్తాయో చేసి చూపించాడు చంద్రబాబు. నామినేషన్ల నాటికి ఆయనకు జనంలో పిసమెత్తు విలువ లేదు. కానీ సరైన అభ్యర్థుల ఎంపిక, పకడ్బందీ ప్రచారం, వనరుల సరఫరా, పత్రికా వార్తల మానిపులేషన్, కార్యకర్తల సమీకరణ తదితరాల ద్వారా ఆయన తన సైకిల్‌ను చాలా నియోజక వర్గాలలో సెకండ్ ప్లేస్‌కు తీసుక వెళ్ల గలిగారు. అసత్య ప్రచారంలో గోబెల్స్‌ను తలపింప జేస్తున్నారాయన. ఇంటలిజెన్స్ నివేదికలని, అవనీ ఇవనీ పేర్లు పెట్టి తన అభ్యర్థులకు విజయావకాశాలు పుష్కలంగా వున్నట్లు ప్రచారం చేస్తున్నారు. ఇంకొక ప్రక్క కాంగ్రెస్ గెలిస్తే కిలో బియ్యం 5 రూపాయలకు పెంచు తుందనే భయం పెట్టాడు. కమ్మ కులస్తులను తన వైపుకు ఆకర్షింప జేయడంలో చంద్రబాబు సఫలీ కృతుడైనట్లే లెక్క.

## రాష్ట్రమంతటా హస్తం గాలి జోరుగా వీస్తూంది!

అన్ని చేసినా ఆయనకు కొన వూపిరి తప్ప విజయం సాధించ గల్గే బలం చేకూరక పోవడం ఆయన నిజ పరిస్థితికి అద్దం పడుతూంది. అయితే చంద్రబాబు తంటాలు పడి చీల్చే ఓట్లు కాంగ్రెస్‌కు ప్రాణ ప్రతిష్ఠ చేస్తున్నాయి. ఆయనెంత ఎక్కువగా ఓట్లు చీల్చుకొంటే కాంగ్రెస్‌కు అంత లాభం అన్నట్లుంది వాతావరణం.

కొరవ 7 పేజీలో



# లక్ష్మి విజయం నిర్ణయమైన నిజం!

పోలింగ్ తేది సమీపించే వరకు నెల్లూరు పార్లమెంటరీ నియోజక వర్గం పరిస్థితి స్పష్టమై పోయింది. సందేహాలకు ఆస్కారం లేకుండా, తటపటా యింపు అవసరం లేకుండా కాంగ్రెస్ అభ్యర్థిని శ్రీమతి పనబాక లక్ష్మి గెలుపు ఖాయమని చెప్పగల్గే వాతావరణం నెల కొంటున్నది. ఆమె అదృష్ట వంతురాలు - ఎప్పుడో గెల్చినట్లే లెక్క.

ఓటర్లలో కాంగ్రెస్ పార్టీ పట్ల వ్యక్తమౌతున్న సానుకూలతే ఇంత గట్టిగా చెప్ప గల్గడానికి కారణం. రాష్ట్రమంతటి వలెనే ఇక్కడా మొన్నటి అసెంబ్లీ ఎన్నికలకు, ఇప్పటికి ఓటర్లలో చాలా మార్పు వచ్చింది. అది పది శాతం కంటే పైనే వుంటుందని అంచనా. అంటే 70 లేదా 80 వేల ఓట్లు. అన్ని ఓట్లు తెలుగు దేశానికి తగ్గి, కాంగ్రెస్‌కు కూడితే ఫలితం విజయమే కదా?

అందులోనూ కాంగ్రెస్ వాదులు చాలా కష్ట పడ్డారు. ఏ పార్లమెంట్ ఎన్నికలోనూ లేనంత శ్రమ పడ్డారు. శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి దాదాపు రెండు వారాలు నెల్లూరులోనే తిష్ట వేశారు. చిన్నా పెద్ద నాయకు లందర్నీ పురమాయించారు. పార్టీ యంత్రాంగాన్ని కదిలించారు. ఆ ప్రేరణ అసాధారణ ఫలితా న్నిచ్చింది. నెల్లూరులో ఆనం వివేకానంద రెడ్డి, సర్వేపల్లిలో సి.వి. శేషారెడ్డి, కోవూరులో దేవకుమార్ రెడ్డి, రాపూరులో రామ నారాయణ రెడ్డి, ఆల్లూరులో విష్ణు వర్ధన రెడ్డి, ఆత్మకూరులో డాక్టర్ బి. సుందర రామరెడ్డి ఈ ఎన్నికను తమ స్వంత ప్రతిష్ఠగా తీసుకున్నారు. అబ్బురి పోయినట్లు తిరిగారు.

ఈ మాత్రం నిబద్ధత, ప్రచారంలో పట్టుదల తెలుగు దేశం పార్టీలు రెండింటిలోనూ కన్పించ లేదు. చంద్రబాబు ఎమ్మెల్యేలు మరీ దాగుడు మూతలాడారు. వారికి స్వంత అభ్యర్థి లేక పోవడం; సిపిఎంకు నెల్లూరు సీటు కేటాయింపు జరగడంతో వారికి ఆట విడుపైంది. ఏడు స్థానాలలోనూ వారి ఎమ్మెల్యేలే వున్నా, పాపం భానురాజా కేవలం సిపిఎం వర్కర్ల పైనే ఆధార పడవలసి వచ్చింది. ఏ ఎమ్మెల్యే కూడా నిజాయితీగా భానురాజాకు మనసు పెట్టి పని చేయలేదనడం నిజం. రమేష్ రెడ్డి టౌన్ వదలి పెట్టి, కోవూరులో కాలక్షేపం చేశారు. లక్ష్మయ్య నాయుడు గారు ఆత్మకూరులో తెలుగు కార్యకర్త లందరూ కట్ట కట్టుకొని జారు కొంటున్నా చూసీ చూడనట్లు వుండి పోయారు. రాపూరులో వైసిఆర్ అంటే ముట్టనట్లు వ్యవహ రించారు. ఆల్లూరులో తెలుగు నాయకు లెవరూ వెంకయ్య గారికి సహక

భారమంతా మోయాల్సి రావడంతో ఈ దుస్థితి ఏర్పడింది. ఆయనకూ కోవూరు, గూడూరులలో తప్ప ఇంకెక్కడా దారులు తెలియవు. సర్వేపల్లి, ఆత్మకూరు వంటి



అదృష్టవంతురాలు!

ప్రాంతాలలో అయితే ఒక్కరంటే ఒక్కరు తెలియదు. నాయకులూ లేరు, కార్యకర్త లసలే లేరు. ఎవడికి పుట్టిన బిడ్డవురా వెక్కి వెక్కి ఏడ్చేవు

వ్యతిరేక ఓట్లు రెండు పక్షాలుగా చీలడం; కాంగ్రెస్‌కు అనుకూలంగా వీచి, పన్నెండు శాతం వరకు స్వింగ్ వుండడంతో ఆమె చాలా అదృష్ట వంతురాలైనారు. కోవూరు, గూడూరులలో కొద్దిగా లోటు వచ్చినా - నెల్లూరు, ఆల్లూరులలో రానున్న మంచి మెజారిటీ శ్రీమతి లక్ష్మికి గెలుపును సుకరం చేయనున్నాయి. సర్వేపల్లి, రాపూరు, ఆత్మకూరుల లోనూ కాంగ్రెస్ స్వల్ప ఆధిక్యత సంపాదించ గల్గితే, కాంగ్రెస్ అభ్యర్థిని మెజారిటీ 50 వేలు దాటిపోయే అవకాశం వుంది.

ఇంత నమ్మకంగా కాంగ్రెస్ గెలుపును వూహించ డానికి కారణం - పల్లెల్లో కొట్టొచ్చినట్లు కన్పడే మార్పు. గత ఎన్నికలో తెలుగు దేశాన్ని వరించిన పలు వర్గాల ప్రజలు తమ తప్పు తెలుసుకొని మళ్లీ కాంగ్రెస్ పక్షం వస్తున్నారు. అభ్యర్థి సిపిఎం నాయకుడు కావడంతో వారిని పట్టి, బలవంత పెట్టి, నివారించే వారూ లేరు. హరిజనులలో ఇది స్పష్టంగా

జరిగి వుండక పోయి వుంటే చంద్రబాబు తెలుగు దేశాన్ని పట్టించు కొనే వారే వుండే వారు కాదు. ఆ వంచనే ఆయన పట్ల పూర్తిగా సానుభూతి కల్గించింది. నెల్లూరులో తమ అభ్యర్థి లేక పోవడంతో ఇక్కడ పెద్దగా శ్రద్ధ చూపలేదాయన. అందువల్లే ఎమ్మెల్యేలకూ ఆట విడుపు లభించింది.

గత అసెంబ్లీ ఎన్నికల్లో ఏడు స్థానాల్లో కలిసి తెలుగు దేశం కంటే కాంగ్రెస్‌కు లక్షా 35 వేల ఓట్లు తగ్గాయి. అప్పుడు మొత్తం పోలైన ఓట్లు 7 లక్షలా 97 వేలు. ఇందులో 10 శాతం కాంగ్రెస్ వైపు మరలాయని అనుకుంటే 75 వేలు అదనంగా వచ్చినట్టు; అప్పటి తెలుగు దేశం ఓట్లు 4 లక్షలా 12 వేలు. ఇందులో 75 శాతం ఒక దేశానికే పడినా - 3 లక్షలు దాటవు. కాంగ్రెస్ 50 వేలకు తక్కువ కాని మెజారిటీతో గెలుస్తుంది. చీలిక ఏక పక్షం కాకుండా, రెండు తెలుగు దేశాలూ చెరి సగం పంచుకుంటే మెజారిటీ పెరిగి పోతుంది. అందువల్ల మెజారిటీ ఎంత అన్నదే ప్రశ్న తప్ప, గెలుపు మాత్రం లక్ష్మిదే!



## సిపిఎంకు నాయకులున్నా ఓట్లు లేవు-
## ఎన్టీఆర్ దేశానికి ఓట్లున్నా యంత్రాంగం లేదు!

రించలేదు; సర్వేపల్లిలో చంద్రమోహన రెడ్డి, గూడూరులో దుర్గా ప్రసాద్‌లు మాత్రమే కొద్దో గొప్పో ప్రచారం చేసారనాలి కాని అది చాలలేదు.

లక్ష్మిపార్వతి అభ్యర్థి సునీల్ కుమార్ అనాథ క్రిందే లెక్క. ఒక్క గూడూరు, కొద్దిగా రాపూరు తప్ప ఆయన్ను పట్టించు కొన్న వారే లేరు. నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి ఒక్కడూ

అన్నట్లుంది సునీల్ అభ్యర్థిత్వం పరిస్థితి.

సిపిఎం, చంద్రబాబు తెలుగు దేశంలకు నాయకులు, కార్యకర్తలు తప్ప ఓట్లు లేక పోవడం; లక్ష్మి పార్వతి తెలుగు దే[illegible] ఓట్లున్నా వాటిని సమీక[illegible] యంత్రాంగం లేక పోవడంతో కాంగ్రెస్ అభ్యర్థిని శ్రీమతి పనబాక లక్ష్మి పంట పండింది. కాంగ్రెస్

కన్పిస్తుంది. బిసిలలోనూ మార్పు వుంది. మార్పు లేనిది గిరిజనులలోనే; వారిప్పటికీ ఎన్టీఆర్ మోజులోనే వున్నారు. వారి దృష్టిలో ఎన్టీఆర్ వారసత్వం లక్ష్మిపార్వతిది. ముస్లింలో అధిక భాగం ఆమె వైపే ఆకర్షింప బడుతున్నారు.

కొత్తగా రేషన్ కార్డుల పంపకం

# కలగూరగంప తప్పదా?

లోక్‌సభ ఎన్నికల తొలి దశ పోలింగ్ జరిగి పోతున్నా - ఏ రాజకీయ పార్టీ కూడా ఓటరును సంతృప్తి పరచ లేక పోతున్నది; ఏ నాయకుడూ జనాన్ని ఆకర్షించ లేక పోతున్నారు. మొత్తం దేశంలో ఓటరును ప్రభావితం చేసి; తమ సమ్మోహనా శక్తితో కాని, విధాన పర, సిద్ధాంత పర బలంతో కాని వారికి నచ్చ చెప్పి పాలనాధి కారం సంపాదించ గల్గిన సామర్థ్యం ఎవరికీ లేదని రుజువై పోయింది. అందువల్లే ఎప్పుడూ లేనంతటి అపవిత్ర కలయికలు, పొత్తులు ఈ ఎన్నికల్లో జరిగి పోతున్నాయి. తన రక్తంలో సోషలిజం జీర్ణించుకొని పోయినట్లు అదే పలవరింతతో బ్రతికిన జార్జి ఫెర్నాండెజ్ పార్లమెంట్‌లో కుర్చీ దొరకదేమోనని భయంతో బిజెపితో జత కట్టాడంటేనే ఈ ఎన్నికల్లో రాజకీయ నాయకుల మనో దౌర్బల్యపు తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. జయ లలితతో కాంగ్రెస్ దోస్తీ; ములాయం యాదవ్‌ల మైత్రి; చంద్రబాబు, కమ్యూనిస్టుల స్నేహం; మాధవ రావు సింధియా వల్ల వాజ్‌పేయి ప్రేమ వంటి వన్నీ ఈ దిగజారుడుకు నిదర్శనాలే!

అంత కన్నా ప్రధాన - ఒక్క పార్టీ కూడా తాము గెలుస్తామన్న ధైర్యంతో లేదు. కాంగ్రెస్‌కు అధికారం ఆశ లేశమైనా లేదు. నూట యాభై సీట్లయినా తెచ్చుకో గల్గితే గొప్ప అను కొంటున్నారు వారు; సర్వే ఫలితాలూ ఆ సంఖ్యనే సూచిస్తున్నాయి. సర్వేలో అతి పెద్ద పార్టీగా బిజెపి అవతరించ గలదని తెల్పుతున్నప్పటికీ, వారికి తమంతట తాముగా ప్రభుత్వాన్ని ఏర్పర్చే బలం వుండదని ఆ సర్వేలే చెప్తున్నాయి. ఇవి రెండూ తప్ప మరే పార్టీ కూడా కనీసం సగం లోక్‌సభ సీట్లకు పోటీ సైతం పెట్టలేదు. కాబట్టి, వారికి అవకాశమే లేదు.

అందువల్లే బిజెపి నాయకుడు వాజ్‌పేయి - రానున్న ప్రభుత్వ ఏర్పాటులో ప్రాంతీయ పార్టీలు చాలా కీలక పాత్ర వహించ నున్నాయని ముందు జాగ్రత్త ప్రకటన చేశారు. తమకు చాలినంత బలం రాదని ముందుగానే ఒప్పేసు కున్నారాయన. విపిసింగ్ - కాంగ్రెస్‌కు తమ అండ గచ్చే అవకాశం వుందని సూచన ప్రాయంగా తెలిపారు. ప్రధానిగా పివిని తప్పిస్తే, అటువంటి సంకీర్ణం చాలా సులభ మంటున్నా రాయన. వివిధ రాష్ట్రాలలో తిరుగుబాటు కాంగ్రెస్ వాదులను ఏకం చేసి ప్రధాన మంత్రిత్వానికి దెబ్బ వేయను శరద్ పవార్ ఇంకొక ప్రక్క యత్నిస్తున్నారు.

కలగా పులగంగా, గందర గోళంగా వుంది రాజకీయ దృశ్యం. జరుగు తున్నవి పార్లమెంట్ ఎన్నికలా లేక గ్రామ పంచాయితీ ఎన్నికలా అన్న విషయమూ అర్థం కావడం లేదు. దేశ ప్రయోజనాలు, జాతీయ విధానాల ఆధారంగా ఏ పార్టీ ప్రచారం జరపడం లేదు. ఎక్కడి కక్కడ, ఏ రాష్ట్రానికా రాష్ట్రంలో, ఏ నియోజక వర్గానికా నియోజక వర్గంలో ఓటరును సంతృప్తి పరచి, గెల్చుక రావడానికి యత్నిస్తున్నారు. ప్రచారంలో జాతీయ దృక్పథం కనుమరుగై పోయింది. రోడ్లకు ఫ్లై ఓవర్ బ్రిడ్జిలు, కాలువలకు వంతెనలు వాగ్దానం చేసి పార్లమెంట్‌కు ఒట్లడిగే దౌర్భాగ్య స్థితి సంప్రాప్తించింది. ఒక్క పార్టీ కూడా స్పష్టమైన ఎన్నికల మేనిఫెస్టోను ప్రకటించక పోవడం; లాంఛన ప్రాయంగా విడుదల చేసిన దానినీ తమ ప్రచారంలో పట్టించు కోక పోవడం ఈ దిగజారుడుకు సాక్ష్యం. దేశ ఆర్థిక విధానాలు, విదేశీ వ్యవహారాలు, సరిహద్దుల రక్షణ, పొరుగు రాజ్యాలతో సంబంధాలు తదితర అంశాలను ఏ నాయకుడూ తమ ప్రసంగాలలో ప్రస్తావించడం లేదు. కనీసం తమ వ్యవసాయ, పారిశ్రామిక

జమీన్‌రైతు

విధానాలనూ నిర్వచించడం లేదు.

దూరదృష్టి, రాజకీయ దృక్పథం, సిద్ధాంత నిబద్ధత, విధానపర అవగాహన లేకుండా కేవలం అధికారపు యావతో ఓట్ల భిక్ష చేస్తున్న ఈ నాయకులు, ఈ పార్టీలు దేశాన్ని ఏమి చేయనున్నాయి? ఏ దుర్గతి సంప్రాప్తింప చేయనున్నాయి? పలు పార్టీల కూటమిగా కేంద్రంలో ప్రభుత్వం ఏర్పడితే; అందులోని మంత్రులు వెలుపటి కొకరు, దాపటి కొకరు పరిపాలనా బండిని లాగడం మొదలు పెడితే ఎటువంటి అనర్థాలు జరుగుతాయో వూహించ గలమా?

ప్రధాని పివి నరసింహా రావు ఒక ప్రసంగంలో హెచ్చరించినట్లు ఈ కలగూర గంప ప్రభుత్వాలు దేశ అస్థిరతకు, విచ్ఛిన్నానికి దారి తీసే ప్రమాదం భయపెడు తున్నది. స్థానిక వనరులు, స్థానిక సమస్యల పరిగణనతో; స్థానిక నాయకుల పలుకుబడి, ప్రాంతీయ ధోరణుల ప్రేరేపణతో పార్లమెంట్ ఎన్నికలు జరగడం కంటే దౌర్భాగ్యం వేరొకటి వుండదు. ఇట్లా గెల్చి వచ్చే ప్రతినిధుల దృష్టి కూడా చాలా సంకుచితంగా వుండ బోతుంది.

ఓటరు విజ్ఞతతో ఆలోచించ వలసిన పరిస్థితి ఇది. ఏ మాత్రం పొరపాటు చేసినా దాని ఫలితం అనుభవించ వలసింది ఓటరే. కేంద్రంలో సుస్థిరమైన, సమగ్రమైన నాయకత్వం, పార్టీ పరిపాలన నిర్వహించడం చాలా అవసరం. అందుకు తగినట్లు ఓటు వేస్తేనే దేశానికి భవిష్యత్తు.

---

జమీన్‌రైతు

26.4.1946

వెల: 0-1-6 పేజీలు:8

## పల్లెటూళ్లు

### బుచ్చి

మొన్న తిరునాళ్లకు కాంగ్రెసు విద్యార్థులు రథానికి మూడు రంగుల జండా గట్టి 'గోవింద' లకు బదులు జాతీయ నినాదాలు ప్రోగించినారు.

### రాపూరు

11.4.46 తేదిన 'గోశాల' ను గూడూరు సబ్ కలెక్టరు గారు తెరిచారు. అనేకులు విరాళా లిచ్చారు. గో సంరక్షణ విషయం మీద పలువురు ఉపన్యసించారు. మన దేశ సౌభాగ్యానికి ఆధారముగు గోవుల బాగోగులను జూచ నిశ్చయించిన రాపూరు పౌరులు ప్రశంస నీయులు.

### చింతోపు

రోడ్డు మీది చెట్లు లిస కొడుతున్నారు. గ్రామాధికార్లు, లోకల్ ఫండ్ వారు నిద్ర పోతున్నారు. నీడ చెట్లయ్యా అవి.

### యల్లాయపాళెం

ఏ జాతి సర్పం కరిచినా మెట్ట మైళ్ల నుండి తెలిసినా పాముల సర్పయ్య కుమారుడు శ్రీ టి.టి. రామసింగు గారు నెమ్మది చేస్తున్నారు.

### కరువు

ఉదయగిరిలో మంచి నీళ్లకు (కొన నీరు) రాత్రిం బగళ్లు పడరాని బాధ పడుతున్నారు. ఊటుకూరులో యింక రెండు రోజులకు మాత్రమే త్రాగేందుకు నీళ్లున్నవి. ఉండే బోరింగు బావి చెడి పోయింది. అట్లే దుత్తలూరులో బావులు చెడి పొయ్యాయి. యిట్లే చాలా గ్రామాల్లో త్రాగేందుకే నీరు లేదు దేవుడో!

పశువుల మేత యెక్కడా లేదు. మనుష్యులకే నీరు లేకుంటే వాటికి నీటి మాట అనుకోని యేమి ప్రయోజనం! ప్రజలకు కూలి నాలి లేక తిండికి భలే యిబ్బంది పడుతున్నారు.

**50 ఏళ్ళ క్రితం ఈ వారం**

బెంగాలు జ్ఞాపకాని కొస్తున్న దండో!

-అగస్త్యరాజు

### కాటిపర్తి

వచ్చిన కోటా అంతా చీకట్లో అమ్ముతారు. పేదా బిక్కికి వెల్తుర్లో గుడ్డ అగ పడటమే లేదు.

-రెడ్డి

### బోయిల చిరువెళ్ల

మా గ్రామానికి గుడ్డల కోటా లేదు. బహు బాధపడు తున్నాము. కో ఆపరేటివ్ స్టోరుకు వెంటనే కోటా యిప్పించ మని, ఒక ఒకటి పెట్టించ మని మనవి.

-రైతు సంఘ కార్యదర్శి

కొరవ 8 వ పేజీలో

---

# ఓటు వేసేముందు ఒకసారి ఆలోచించండి!

గతంలో కాంగ్రెసేతర ప్రభుత్వాల పని తీరు, సంకీర్ణ పాలన అనుభవాలు చవి చూశాం. భారతీయ జనతా పార్టీ, ఆర్ఎస్ఎస్ కూటముల ద్వంద్వ సభ్యత్వం సాకుతో అలనాటి మురార్జీ దేశాయ్ ప్రభుత్వం కూలి పోయింది. రథ యాత్ర రచ్చలో అద్వానీ అరెస్టుతో మద్దతు వుప సంహరించు కోవడం విపి సింగ్ సంకీర్ణ ప్రభుత్వం ఆయుష్షు ముగిసింది. తరచూ మధ్యంతర ఎన్నికలు జరపడం వల్ల దేశ ఆర్థిక వ్యవస్థ అతలా కుతలమై పోతుంది. అందువల్ల ఆటు పోట్లకు నిలబడి, సుస్థిరత, భద్రతలు ఇచ్చే పార్టీకే ప్రజలు ఓటేస్తే దేశం అభివృద్ధి పథం వైపు ప్రయాణిస్తుంది.

వల్లూరు -వి. శ్యామల

## ప్రైవేట్ టౌన్ బస్సుల పని పట్టాలి!

వారానికి ఒకరు టౌన్ బస్సు చక్రాల క్రింద పడి నలిగి పోతున్నా, ఈ సమస్య గూర్చి పట్టించుకొనే నాధుడే కరువయ్యారు. పోలీసులు, రవాణా శాఖాధికారులు వుదాసీన వైఖరిని అవలంబిస్తున్నారు. టౌన్ బస్సుల వేగాన్ని నియంత్రించడం లేదు. ఓవర్ లోడును పట్టించు కోవడం లేదు. బస్సులను ప్రజలు ఆగ్రహం పట్టక తగల బెడుతూ పోతున్నారంటే సమస్య ఎంత దూరం వెళ్లి పోయిందో అధికారులకు అర్థం కావడం లేదా? టౌన్ బస్సుల్లోని సిబ్బంది వ్యవహరించే తీరు ఒకసారి ఎస్పీ, ఆర్టీవో స్వయంగా బస్సులెక్కి పరిశీలిస్తే అర్థమౌతుంది.

**జనవాణి**

ఎన్నికలయ్యాక జిల్లా కలెక్టర్ టౌన్ బస్సుల సమస్యను పట్టించు కోవాలని మనవి.

నెల్లూరు -కె. విజయ

## లక్ష్మి కార్యదీక్షా పరురాలు

పార్టీని పార్టీ సిద్ధాంతాలను చూసి ఓటు వేయాల్సిన పరిస్థితుల నుంచి వ్యక్తిని చూసి ఓటు వేయాల్సిన పరిస్థితుల్లోకి ప్రస్తుత రాజకీయాలు వచ్చాయి. విచారించ తగ్గ విషయమైనా ప్రజలకు ప్రస్తుత పరిస్థితుల్లో కావలసింది ప్రజాసేవ చేసే నాయకులు. నెల్లూరు పార్లమెంటరీ నియోజక వర్గంలో కాంగ్రెస్ అభ్యర్థి పనబాక లక్ష్మి గారితో ఏడు సంవత్సరాలుగా నాకు పరిచయం. ఆమె భర్త పి. కృష్ణయ్య నా క్లాస్‌మేట్. ఆ విధంగా ఆ కుటుంబం నాకు పరిచయం. లక్ష్మి ఎంత విద్యా వంతురాలో, అంత సౌమ్యురాలు. నిరాడంబర జీవి. తన భర్త వుద్యోగ రీత్యా పర్యటనలో వున్న సమయాల్లో కూడా ఎవరైనా నెల్లూరు నుంచి వెళ్లి

కొరవ 11 పేజీలో

# ఎన్నికలకు అన్నీ రెడీ- హద్దుదాటితే చర్యా గ్యారంటీ!

పార్లమెంటు ఎన్నికలకు అన్ని ఏర్పాట్లు పూర్తయినట్లు జిల్లా కలెక్టర్ డాక్టర్ సాంబశివ రావు చెప్పారు. 24 తేది తన ఛాంబర్‌లో విలేకరులతో మాట్లాడుతూ నెల్లూరు పార్లమెంటు నియోజక వర్గాన్ని 87 జోన్లుగా విభజించి 87 మంది జోనల్ ఆఫీసర్లను నియమించినట్లు వివరించారు. బ్యాలెట్ పేపర్లు సిద్ధంగా వున్నాయని. ఒంగోలు పార్లమెంటు నియోజక వర్గంలో బ్యాలెట్ పేపర్ కాసింత పెద్దదిగా వుండడం వల్ల 500 పెద్ద బ్యాలెట్ పెట్టెలు ఉదయగిరి, కావలిలో వుపయోగిస్తున్నారట. పోలింగ్ సిబ్బందికి 26 తేది ఉదయానికి గాని తమను విధులకు ఎక్కడ వేసారన్నది తెలియ దన్నా రాయన. పోలింగ్ రోజు 146 ఆర్టీసి, 84 ప్రైవేటు బస్సులు, 130 ప్రభుత్వ జీపులు, 220 ప్రైవేట్ కారు వినియో గిస్తున్నారట. జిల్లాలో 503 సమస్యాత్మక గ్రామాలు గుర్తించినట్లు చెబుతూ 6 ప్లే టూన్ల కేంద్ర పోలీసు దళాలు బందోబస్తుకు వినియోగిస్తున్నట్లు తెలియ జేశారు. వైర్‌లెస్ సెట్లు, టెలిఫోన్లతో పాటు తొలిసారిగా మోటరోలా పేజర్స్ వుపయోగి స్తున్నారు. పోలింగ్ రోజు అభ్యర్థులు తిరిగే వాహనాలకు తప్పని సరిగా పర్మిట్ అవసరమని; ఇండి పెండెంట్ల వాహనాలు దుర్వినియోగం చేస్తే సీజ్ చేసి పారేస్తా మన్నారు. అరుణా గ్రాఫిక్స్, శ్రీవెన్ ప్రింటింగ్ ప్రెస్‌లో సరియైన వివరణ, అనుమతి లేకుండా కరపత్రాలు ప్రింట్

**కలెక్టర్ వివరణ - హెచ్చరిక!**

చేస్తున్నందున ఆ ప్రెస్‌లను సీజ్ చేసినట్లు చెప్పారు. గూడూరులో ప్రభుత్వ అతిథి గృహం దుర్వినియోగం, వ్యక్తి గతంగా నాయకులను విమర్శించిన మరో పార్టీ నాయకుడికి నోటీసు జారీ చేసారట. నెల్లూరులో ఒక పార్టీ ర్యాలీలో మత పరమైన నినాదాలు చేయడం, మరో పార్టీ కర పత్రంలో మత చిహ్నాలు వుపయోగించడం పై ఎన్నికల కమీషన్‌కు నివేదిక పంపినట్లు వివరించారు. కావలి నియోజక వర్గం ప్రభుత్వ అధికారుల పై ఎక్కువ ఫిర్యాదు లొచ్చాయని, వాటిని విచారించి తగిన చర్యలు తీసు కొంటా మన్నారు. ఎన్నికల విధులు నిర్వహిస్తూ ప్రమాదవశాత్తు మరణించిన ప్రభుత్వ సిబ్బందికి 1 1/2 లక్షల రూపాయల నష్ట పరిహారం కేంద్ర ఎన్నికల సంఘం ప్రకటిం చిందన్నారు. సమావేశంలో డి.ఆర్.ఓ. రామచంద్ర, ఆర్డీఓ కుమారి టి.కె. శ్రీదేవి కూడా పాల్గొన్నారు.

### ఎన్నికల రోజు అన్ని ఆఫీసులకూ శెలవు

పార్లమెంటు ఎన్నికలు జరిగే 27 తేది అన్ని ప్రభుత్వ రంగ, ప్రైవేట్, వాణిజ్య, పరిశ్రమలు, కర్మా గారాలకు జిల్లా కలెక్టర్ సెలవు ప్రకటించారు. పనిచేసే వుద్యోగులు, కార్మికులు ఓటు హక్కు వినియోగించు కొనేందుకు వేతనంతో కూడిన శెలవు దినంగా ప్రకటించినట్లు కలెక్టర్ చెప్పారు.



నెల్లూరు టౌన్‌లో కాంగ్రెస్ అభ్యర్థికి మద్దతుగా ప్రచారం చేస్తున్న సినీ నటులు ధర్మవరపు సుబ్రహ్మణ్యం, ప్రక్కన మునిసిపల్ ఛైర్మన్ ఆనం వివేకానందరెడ్డి, పందిళ్లపల్లి అరుణమ్మ.

# సణుగుడు

*** రంగడి ఆస్తి అరగించేందుకు కుట్ర**

*** బిజెపి నాయకులింత అమాయకులా?**

రంగనాయకుల పేట, శ్రీ రంగ నాథ స్వామి ఆస్తిని అప్పణంగా తిని, అరగించు కోవడానికి పెద్ద కుట్ర జరుగు తూంది. రాజకీయ వాదుల అండ, అధికార్ల అలసత్వంతో ఈ దుర్మార్గం నిరాటంకంగా జరిగి పోయేట్లుంది.

రంగ నాథుడికి జిల్లాలో, టౌన్‌లో కోట్ల విలువ చేసే ఆస్తు లున్నాయి. కానీ అన్నీ అన్యాక్రాంతమే. ఆ స్వామి ఎప్పుడూ పవళింపు సేవలో, మాగన్ను నిద్రలో వుంటాడు లెమ్మనే ధైర్యం కాబోలు - ఆయన ఆస్తి అంటే పటిక బెల్లంతో సమానం; ఎవరి చేతికి దొరికినా వదలిపెట్టే ప్రసక్తి వుండదు. ఆయనా దయా మయుడు - తినే వారిని చూస్తూ వూరకొంటాడు తప్ప, వారి పై తన విష్ణు చక్రం ప్రయోగించాలని తలపెట్టడు.

స్టోన్‌హౌస్ పేటలో స్వామి పేరిట కోట్ల విలువ చేసే భూమి ఒకటి వుంది. ఏడెకరాల విస్తీర్ణం - అంకణం ఏడెనిమిది వేల ధర - ఇక దాని విలువ ఎన్ని కోట్లో వూహించు కోవచ్చు. అక్కడే వుండే ఒక మహమ్మదీయ రైతు చాలా ఏళ్ల నుంచి ఆ బంగారు భూమి అన్యాక్రాంతం కాకుండా కాపాడు కొంటూ వచ్చాడు. రంగడికి అతడి పరోక్ష సేవ - ఆళ్వారులతో సమమైంది. ఇప్పుడా ఆస్తిని; పది, పదిహే నంకణాల బిట్లు చేసి, తమ తాత ముల్లె అయినట్లు అరగించ బోతున్నారు కొందరు వైశ్య ప్రబుద్ధులు. ఈ నీచులకు తెలుగు రాజకీయ మద్దతు వున్నట్లుంది. అదే ప్రదేశంలో, అదే రంగడికి చెందిన పన్నెండె కరాల పసిడి భూమిని ఇదే కమ్యూనిస్టు వెధవలు ఇది వరకే అమ్మేశారు. వారితో వున్న స్నేహాను బంధంతో

**[ డోలేంద్ర ]**

అప్పటికి మునిసిపల్ ఛైర్మన్‌గా వున్న ఇప్పటి మంత్రి టి. రమేష్ రెడ్డి ఆ స్థలంలో రాత్రికి రాత్రి వీధి లైట్లు వేసి, కొళాయిలు బిగించి, రోడ్లు పరిపించి, ఆ అక్రమణలను చట్ట బద్ధం చేశారు. ఆ రోజు తాను వారికి చేసిన సహాయం దేముడికి ఎంత అపకారం చేసింది

కొరవ 7 పేజీలో

# సత్యాన్ని నమ్మిన న్యాయవాది ఎప్పటికైనా రాణిస్తాడు!

వి.ఆర్. లా కాలేజి వార్షికోత్సవాన్ని కూడా కళాశాల పాలక వర్గం 19 తేది ఘనంగా నిర్వహించింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన అదనపు జిల్లా జడ్జి బి. చంద్ర కుమార్ వుపన్యాసం న్యాయ కళాశాల విద్యార్థులను ఎంతగానో ఆకట్టుకొంది. సత్యాన్ని నమ్ముకొని న్యాయవాద వృత్తి సాగించే వాడు, సంఘంలో మంచి న్యాయవాదిగా గుర్తింపు పొందుతాడు.

**నెల్లూరు సంగతులు**

ఓపిక మంచి న్యాయవాదిని చేస్తుంది. న్యాయ కళాశాల విద్యార్థులు జీవితంలో అలసి పోవడం అనే మాట తీసి గట్టున పెట్టమని సలహా యిచ్చారాయన. ఒడి దుడుకులు న్యాయవాదిని రాటు దేలుస్తాయని, అందుకు తాను వుదాహరణ అని చంద్ర కుమార్ తన కెరీర్‌లోని తొలి రోజులను విద్యార్థుల ముందుంచారు. అధ్యక్షత వహించిన సీనియర్ న్యాయవాది గునుపాటి అనసూయ రెడ్డి మాట్లాడుతూ ప్రస్తుతం న్యాయ వాదుల్లో న్యాయ శాస్త్రం చదివే శ్రద్ధ తగ్గి పోతున్నట్లు చెప్పారు. పాలనా వ్యవస్థలో జరిగే లోటు పాట్లను సరిదిద్ద గల శక్తి న్యాయ వ్యవస్థకే వున్న విషయాన్ని ఈ సందర్భంగా ఆయన గుర్తుకు తెచ్చారు. కళాశాల ప్రిన్సిపల్ అల్లాడి సుబ్రహ్మణ్యం తొలుత స్వాగతం చెప్పి, చివరన వందనాలు చెల్లించారు.

### నెల్లూరులో పెళ్లిసందడి సినిమా బృందం

తారాబలం లేకుండా కథా బలంతో తనదైన టెక్నిక్ మేళవించి దర్శకుడు కె. రాఘవేంద్ర రావు తీసిన పెళ్లి సందడి నెల్లూరు నర్తకి థియేటర్‌లో నూరు రోజులు విజయ వంతంగా ప్రదర్శింప బడింది. ఈ సందర్భంగా ఆ చిత్రంలో నటించిన నటులు, సాంకేతిక బృందం 20 తేది సినిమా హాలుకు వచ్చి ప్రేక్షకులకు కృతజ్ఞతలు తెలిపారు. టౌన్‌లో రాజకీయ నాయకుల వాద యాత్ర మాదిరిగా గాంధీ బొమ్మ నుంచి చిత్రం యూనిట్ పై పూల జల్లులు కురిపిస్తూ థియేటర్ అధినేత కె. హరిప్రసాద్ రెడ్డి స్వాగతం పలికారు. హీరో శ్రీకాంత్, హీరోయిన్ రవళి, దర్శకుడు కె. రాఘవేంద్ర రావు, రచయిత కె. సత్యానంద్, హాస్య నటులు బ్రహ్మానందం, ఎవిఎస్, తనికెళ్ల భరణి, గుండు హనుమంత రావు, శివాజీ రాజా, చిత్ర నిర్మాతలు సి. అశ్వనీ దత్, అల్లు అరవింద్, ఆంధ్ర జ్యోతి దినపత్రిక నిర్వాహకుడు కానూరి జగదీష్ చంద్ర ప్రసాద్ ఈ బృందంతో వచ్చారు. ప్రేక్షకులను కాసింత సేపు కడుపుబ్బా నవ్వించి, తర్వాత సినిమా బృందం కావలికి బయలుదేరి వెళ్లింది. నెల్లూరు వచ్చే ముందు గూడూరులో కూడా ఈ బృందం ప్రేక్షకులను కలిసింది.

### అతిసార పై అధికార్లకు జాయింట్ కలెక్టర్ సూచన

జిల్లాలోని నెల్లూరు, గూడూరు, కావలి మనిసి పాలిటీలు ఇతర గ్రామాల్లో అతిసార వ్యాధి సోకకుండా వుండేందుకు ప్రజలను జాగృత పరిచే కార్యక్రమం చేపట్టాలని జాయింట్ కలెక్టర్ జి.ఎస్.వి. ప్రసాద్ పిలుపు నిచ్చారు. 20 తేది కలెక్టరేట్ లోని సైక్లోన్ మీటింగు హాలులో వైద్య, ఆరోగ్య శాఖ, పబ్లిక్ హెల్తు అధికారులు, మునిసిపల్ కమీషనర్లు, జిల్లా పంచాయితీ అధికార్లతో అతిసార వ్యాధి అరికట్టేందుకు తీసుకొంటున్న చర్యలు అడిగి తెలుసు కొన్నారాయన.

# పురాణేతిహాసాలే జనాన్ని ధర్మపథంలో నడిపిస్తున్నాయి!

నెల్లూరు వర్తమాన సమాజం యాజమాన్యాన టౌన్ హాలులో 20, 21 తేదిల్లో రామాయణ ప్రశస్తి సభలు జరిగాయి. తొలి రోజు సభకు ఇన్ కంట్యాక్స్ ఆఫీసర్ ఆర్.వి. నాగరాజ్ అధ్యక్షత వహించి మాట్లాడారు. తాత్కాలిక వినోదం కల్గించే సాహిత్య ప్రభావం ఈ రోజుల్లో అధికంగా కనపడు తున్నది. బండ్ల కొద్దీ వెలువడుతున్న ఈ సాహిత్యం వెంట వెంటనే కాల గర్భంలో కలసి పోతుంది. కాని చిర కాలం నిలువ గలిగిన పురాణ, ఇతి హాసాలు తరతరాల ప్రజా నీకానికి సాధు జీవన పద్ధతులను తెలియ, జేస్తున్నట్లు చెప్పారు. సార్వ కాలిక సత్య ధర్మ పథాన్ని చూపుతున్న రామాయణ భారతంలో ఈనాడు వుద్యోగులు, అధికారులు, సేవకులు పాటించ వలసిన అనుసరించ దగిన ఉత్తమ ఉపదేశాలు కొల్లలుగా వున్నట్లు వివరించారు.

**రమణీయ రామాయణ ప్రశస్తి సభలు**

ముఖ్యోపన్యాసకులుగా విచ్చేసిన శాతవాహన కళాశాల ఆంధ్రో పన్యాసకులు డాక్టర్ బంధ్యాల మహతి శంకర్ రమణీయ రామాయణంలో కవితా మాధుర్యం గూర్చి చెప్పారు. దుగ్గొట్టి రమణయ్య రచించిన రామాయణంలో అసాధారణ కవితా శిల్ప నైపుణ్యం అడుగడుగునా కాన వస్తుంది. ప్రతి పద్యంలోనూ అచ్చ తెనుగు అభిమానం కొట్ట వచ్చినట్లుగా కనపడు తుంది. శ్రీరామ చంద్రునిలోని సత్య ధర్మ పరాక్రమాలను విశ్వామిత్రుడు వెల్లడించిన సంగతి అనితర సాధారణంగా వుందన్నారు. అహల్య శాప నివృత్తి, శివ ధనుర్భంగం, గుహుడు, శబరి, రామునకు చేసిన సేవలు కమనీయమైన సొరవదిలో సాగా మన్నారు.

రెండవ రోజు సభకు రిటైర్డ్ జిల్లా జడ్జి శ్రీ కె.పి. నారాయణ రావు

కొరవ 8 పేజీలో

# ఈ దేశం మీకు చాలా రుణ పడివుంది-
# ఈ జాతి మిమ్మల్ని చూసి గర్వపడుతూంది!



*నా దేశానికి నేనేమి చేశానన్న ప్రశ్న మిమ్మల్ని మీరే వేసుకొంటే-*

- దివాలా తీసిన ఖజానాను కోట్ల నిధులతో నింపారు.
- విదేశీ పెట్టుబడులను ప్రవహింప జేశారు.
- యాభై ఏళ్ల పారిశ్రామికీకరణను ఐదేళ్లలోనే సాధించి పెట్టారు.
- అవినీతి రుజువైన మరు క్షణంలో కేంద్ర మంత్రినైనా అరెస్ట్ చేయించారు.
- అల్లకల్లోల అయోధ్య అకృత్యం చల్లబడేటట్లు చేశారు.
- తగలబడి పోతున్న పంజాబ్‌లో ప్రజాస్వామ్య పుష్పాలు పూయించారు
- దేశ ప్రతిష్ట దశదిశలా వెలుగుతో వ్యాపింప జేశారు.
- ప్రతి భారతీయుడూ సగర్వంగా తల ఎత్తుకు బ్రతికేట్లు చేశారు.
- భరత ఖండం భవిష్యత్తును బంగారు మయం చేశారు!

ఏ నాయకుడు సాధించాడిన్ని విజయాలు?

ఏ నేత సమర్పించాడీ జాతికి ఇన్ని అభివృద్ధి ఫలాలు?

ఈ దేశం మీకిప్పటికే చాలా రుణపడింది-

ఈ జాతి మిమ్మల్ని చూసి గర్వపడుతూంది!

ఈ ప్రజ మీ నుంచి ఇంకా చాలా ఆశిస్తూంది -

ఈ నేల మీకు అర్పిస్తూంది నీరాజన హారతి!

మీరుండాలి నూరేళ్లు!

మీ ప్రభుత్వముండాలి మరో ఐదేళ్లు!

మీ ప్రభ వెలగాలి ఇంకా చాన్నాళ్లు!

పెళ్ళకూరు వసంత కుమార్ రెడ్డి

## నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాయి

అధ్యక్షత వహించి మాట్లాడారు. సంస్కృత నాటక సాహిత్యానికి భాసుడు ఆద్యుడన్నారాయన. ముఖ్య ఉపన్యాసకులు డాక్టర్ జంధ్యాల మహతీ శంకర్ భాసుని ప్రతిమా నాటక ప్రాశస్త్యం గూర్చి మాట్లాడారు. పూర్వపు ఆంధ్ర ప్రదేశ్ ఆస్థాన కవి, శతావధాని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి అనువదించిన యజ్ఞ ఫలం నాటకం నుంచి జంధ్యాల లక్ష్మి నారాయణ శాస్త్రి అనువదించిన ప్రతిమా నాటకంలోని పద్యాలను ఉటంకిస్తూ తీసుకొని భాసుని రచనా నైపుణ్యాన్ని చక్కగా వివరించినట్లు చెప్పారు. లోకంలో కైక, మంధర అనేవారిని మహా దుష్ట మహిళలనే భావన వుందని, ఆ అపప్రథను తొలగించ డానికి భాసుని కల్పనలు అధికారికమైన సొగసును కల్గించిన వన్నారు. తన పేరిట వున్న ఛారిటబుల్ ట్రస్ట్ పక్షాన ప్రముఖ చార్టెడ్ అకౌంటెంట్ దుగ్గిరాల వెంకట రమణయ్య అధ్యక్ష ఉపన్యాస కులను నూతన వస్త్రాలతో సత్కరించారు. సభారంభంలో వర్ధమాన సమాజం కార్యదర్శి టి.వి. నరసింహం స్వాగతం చెప్పి, ఆయనే చివరన వందనాలు చెల్లించారు.

### పివి నరసింహా రావుకు ఎవరూ సాటి రారు!

తన రాజకీయ జీవితంలో తొలి నుంచి ఏ మచ్చా లేని నాయకుడు, ప్రస్తుత ప్రధాని పివి నరసింహా రావు మీద ప్రతి పక్షాలు పేలుపోక అనవసరమైన ఆరోపణలు చేస్తున్నాయని పిసిసి ప్రచార కమిటీ సభ్యుడు పెళ్లకూరు వసంత కుమార్ రెడ్డి చెప్పారు. 24 తేది విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి మెజార్టీ స్థానాలు రావడం ఖాయమన్నారు. దేశంలో స్వాతంత్ర్యం వచ్చాక 1947 నుండి 91 వరకు మన దేశంలో విదేశాలు పెట్టిన పెట్టుబడి మొత్తానికి రెట్టింపు పివి నరసింహా రావు హయాంలో వచ్చిందని; లైసెన్సుల రాజ్యం అంతం మవడం వల్ల పారిశ్రామికాభివృద్ధికి మార్గం సుగమం అయిందని చెప్పారు. పివి నరసింహా రావు గారు ప్రజాభీష్టం పైనే నంద్యాల, బరంపురంలలో పోటీ చేస్తున్నారే తప్ప, ఓటమి భయంతో కాదని, పూర్వం ఎన్టీఆర్ రెండు చోట్ల పోటీ చేసినప్పుడు ఈ నాయకులు నోరెందుకు మెదప లేదని ప్రశ్నించారాయన. పివి ప్రత్యేక శ్రద్ధ వల్లే ఇఫ్కో ఫ్యాక్టరీ నెల్లూరుకు వచ్చిందన్నారు.

### నెల్లూరు అడ్వకేట్స్ క్లర్క్స్ అసోసియేషన్

నెల్లూరు అడ్వకేట్స్ క్లర్క్స్ అసోసియేషన్ సర్వసభ్య సమావేశం 15 తేది నెల్లూరులో జరిగింది. ఈ సందర్భంగా నూతన కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు. అధ్యక్షునిగా గుళ్లపల్లి సత్య నారాయణ, ఉపాధ్యక్షునిగా అన్నవరం సత్య నారాయణ, కార్యదర్శిగా డి. వెంకట రత్నం, కోశాధికారి పాముల గౌరి శంకర రావు, కార్యవర్గ సభ్యునిగా కె. విజయ కుమార్, ఎ. బాబూ రావు, టి. సుధాకర్, ఎ. వేణుగోపాల రావు, వి. మల్లి ఖార్జున రావులను ఎన్నుకొన్నారు.

## పంచాంగం

భరణి కార్తె

27 తేది శనివారం భరణి కార్తె ప్రారంభం.

ముహూర్తములు

28 తేది ఆదివారం ఉదయం 7.20 గంటలకు వృషభ లగ్నమున వివాహ, వ్యాపారా రంభములకు 1 తేది బుధ వారం ఉదయం 7.16 గంటలకు వృషభ లగ్నమున గృహా రంభ వివాహ వ్యాపార ములకు సుముహూర్తము లున్నవి.

### ఏప్రెల్ తిథులు

వైశాఖ శుద్ధ

| | | |
|---|---|---|
| తే 27 శని | నవమి | ప.గ. 3.00 వ |
| తే 28 ఆది | దశమి | ప.గ. 4.30 వ |
| తే 29 సోమ | ఏకాదశి | ప.గ. 5.40 వ |
| తే 30 మంగళ | ద్వాదశి | రా.గ. 6.20 వ |

### మే తిథులు

| | | |
|---|---|---|
| తే 1 బుధ | త్రయోదశి | రా.గ. 6.30 వ |
| తే 2 గురు | చతుర్దశి | రా.గ. 6.00 వ |
| తే 3 శుక్ర | పూర్ణిమ | సా.గ. 5.12 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఎ.

## రాయి - తురాయి

10 పేజీ తరువాయి

పదవికి తద్దినం పెట్టడం! పున్నామ నరకం సంగతి దేవుడి కెరుక - ఎన్టీఆర్‌కు బ్రతికి ఉండగానే నరకం చూపించిన ఘనత హరికృష్ణ అనబడే పుత్రుడిదే.

రుజువులు కావాలా? ముంజేతి కంకణానికి అద్దమా? లక్ష్మిపార్వతి నెపంతో హరికృష్ణ ఎక్కు పెట్టి వదలిన శిలీ ముఖాలన్నీ తండ్రి గుండెలో గుచ్చుకొని గోడుగోడు మనిపించెనే! ఆయన అపర వయస్సులో రెండో పెళ్లి చేసుకొంటే మాత్రం - కొడుకు విద్వేషాగ్నిలో ఉడికి పోవాలా?

శంతనుడు కూడ వయో వృద్ధుడే; పెళ్లికి ఎదిగిన కొడుకు ఇంట్లో ఉన్నాడు. అయినా సత్యవతిని చేపట్టాలను కున్నాడు. తెలుసు కొన్న కొడుకు - దేవ వ్రతుడు - సత్యవతిని తెచ్చి తండ్రికి కట్టబెట్టి, తాను ఆజన్మాంతం బ్రహ్మచారిగా ఉండి పోయ్యాడు - అతడే భీష్ముడు. ఇదీ మన చరిత్ర - ఇదీ మన సంస్కృతి - ఇదీ తండ్రీ తనయుల నడుమ అనుబంధం - ఆత్మీయత - తండ్రి పైన తనయుడికి ఉండ వలసిన గౌరవం.

యయాతికి మగువల పై వ్యామోహం చావలేదు. ముదిమి ముంచు కొచ్చినా, విషయ వాంఛా లాలస ఉడిగి పోలేదు. కొడుకు తన యవ్వనాన్ని తండ్రికి ధారపోసి, తాను తండ్రి వార్ధక్యాన్ని స్వీకరించాడు. తండ్రి కోసం తనయుడు చేసిన త్యాగపు ధర్మ పన్నాలు లక్ష్మి పార్వతి దగ్గరే ఆగిపోతే ఎట్లా? తనయుడైన తనకు కుదరవా? "పెరవి దాటితే వృథివి దాటుతుందని" సామెత. మాటలు మీరే టప్పుడు ముందు వెనుకలు అవసరం లేదా?

"పులి వంటి వాడిని పిల్లిని చేసింది" అంటే - ఇది లక్ష్మిపార్వతి నేర్పుకు ప్రశంస; తండ్రి చేతగాని తనానికి అభిశంస. మగటిమి పెంపుదలకు సైరాయిడ్సు ఇచ్చారు అనే హరికృష్ణ ప్రకటనలో ఇంటి గుట్టు వీధిన పడలేదా? తండ్రి పరువు ఉప్పు గూటి పాలేదా? ఆ ఆరు నూటు కేసులు వాపసు చేస్తే టీడలకు సంతర్పణ చేస్తాం అనడంలో తండ్రి అవినీతికి పాల్పడినట్లు తనయుడే ఢంగ్యంతరంగా చాటింపు వేసినట్టింది. ఇరుకు మాతు తనానికి ఉచితాను చిత వివక్షణ తెలియదు.

ఇటువంటి కొడుకు వారసత్వపు గంపను నెత్తి నెత్తుకొని ఓట్లు దూసి పోసు కోవడానికి ఊరూ, వాడు ఊరేగుతూ పోవడం చిత్రం. ఈ నీచమైన వారసత్వపు వాదాలతను నిగ్గదీసి ప్రశ్నించలేని పత్రికల వైఖరి చిత్రాతి చిత్రం! ప్రజాస్వామ్య వ్యతిరేక వారసత్వాన్ని గురించి పల్లెత్తు వ్యాఖ్యకు చోటు లేదా; పత్రికల్లో?

*శ్రీశ్రీ చెప్పినట్లు*
*గోమాతకు రెండు తలల*
*కొడుకులు వెలిశారంట*
*గోసాయికి నెత్తి మీద*
*కొమ్ములు మొలిచాయంట*

ఇటువంటి రాతలకైతే చాలి నంత చోటు! ప్రజావాణికి బాణీలు కూర్చడమేనా పత్రికల పని? వాళ్లలో కొంచమైనా కదలిక తేవలసిన బాధ్యత పత్రికలది కాదా?

ఇక్కడ మన కమ్యూనిస్టు సోదరుల ప్రస్తావన కూడ తేవలసిన అవసరం వుంది. అవి ఎమర్జన్సీ రోజులు; దేవకాంత్ బారువ అనే ఆయన ఆలిండియా కాంగ్రెసు ప్రెసిడెంటు; ఆయన ఉన్నట్టుండి అనరాని మాట అనేశాడు; ఇండియాయే ఇందిర, ఇందిరే ఇండియా అని నోరు జారేశాడు.

అప్పుడు ఈ కమ్యూనిస్టులు పడ్డ పాటు అంతా ఇంతా కాదు. బారువాను పట్టుకొని దూది ఏకినట్లు ఏకి పారేశారు. పాపం బారువాకు భోరున ఏడ్చినంత పని అయి పోయింది.

మార్క్సిస్టు తాత్త్విక చింతనను - గోచులు ఎగగట్టి, పలుగు పారా చేత బట్టి తవ్వి తలల కెత్తుకొన్నా మంటూ బీరాలు పలుకు తుంటారు కమ్యూనిస్టులు. ఆనాడు అగ్గిమీద గుగ్గిలంలా బారువా మీద మండి పడిన కమ్యూనిస్టులు, ఇప్పుడు ఈనాడు నిమ్మకు నీరెత్తి నట్లున్నారు. వారసత్వాన్ని ఈసడించలేని నీరస స్థితిలో తడిగిల బడి పోతున్నారు. మార్క్సు, తన సిద్ధాంత గ్రంథాల్లో ఎక్కడైనా సన్న అక్షరాల్లో మనం తెలుసు కోలేని, కమ్యూనిస్టులు మాత్రమే తెలుసు కొగలిగిన ఏదైనా పరిభాషలో వారసత్వ రాజకీయాలకు వత్తాసు పలికాడేమో! తెలుసు కోవాలని ఉంది - తెలియ జేసే ఉ...స్టు పండిత ప్రవీణులుంటే!

మైడియర్ కామ్రేడ్స్! మీకు సహస్రాధిక వి-'ప్లవ'వ అభివందనాలు; ఎందుకంటే మీ మార్క్సిజం పరపంచల్లో ఊడిగం చేస్తున్నందుకు ఇంకా ఎందుకంటే "దానొకిపిటల్" సీట్ల బేరంలో చిక్కి దేబిరిస్తున్నందుకు!!

## 50 ఏళ్ళ క్రితం

3 పేజీ తరువాయి

### ముత్తుకూరు

ముత్తుకూరు కృష్ణా పట్నం గ్రామాల్లో 3 యేండ్లకు పై బడ్డ బిడ్డలకు గూడ బియ్యం రేషన్ ఇవ్వకుంటే ఏమి తిని పెంచ మంటారయ్యా?

### కోవూరు

రౌడీలు కాని వాళ్లకు, బ్లాక్ మార్కెట్‌లో కొన లేని వాళ్లకు గుడ్డలు దొరకడం లేదు. అందరికీ దొరకేట్టు యింకేమి మార్గం లేదా?

- వెంకటస్వామి

## మా టలతో ఆ ట

మొదటను మేత పెట్టే పద్యకేళిను ఈ వారం నుంచి ప్రారంభి స్తున్నాము పూర్తి కరెక్టుగా సమాధానాలు వ్రాసే పాఠకుల పేర్లు ప్రచురించడంతో పాటు వారిలో ఇద్దరిని ఎంపిక చేసి ఆకర్షణీ యమైన బహుమతి ఇవ్వబడుతుంది జమీన్‌రైతు పత్రికలో ప్రచురించే గళ్ల నుడికట్టు పటం పైనే సమాధానాలు నింపాలి. కొట్టి వేతలు, దిద్దులు వుండకూడదు. ప్రయత్నించండి - ఆ అదృష్ట వంతులు మీరేనేమో!

(సంపాదకుడు)

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | 4 | | | 5 | | 6 | 7 |
| | | 8 | | | | | 9 | 10 | | 11 | |
| 12 | 13 | | | 14 | | 15 | | | 16 | | |
| | | | 17 | | | | | 18 | | | |
| | | 19 | | | 20 | | | | | | 21 |
| | 22 | | 23 | 24 | | | | 25 | | 26 | |
| 27 | | 28 | | 29 | 30 | | 31 | | | 32 | |
| | 33 | | 34 | | 35 | 36 | | 37 | 38 | | |
| 39 | | 40 | | | | 41 | | | | | 42 |
| 43 | | | | | 44 | | | 45 | | 46 | |
| 47 | | 48 | | 49 | | | 50 | | | 51 | |
| | | | | 52 | | | | 53 | | | |

**నిలువు**

1. వైష్ణవుల పుణ్యక్షేత్రం (5)
2. తిరుగు (3)
3. మామూలుగా,ఆర్భాటం లేకుండా (4)
4. గొప్పతనం (3)
5. అతేవాని (4)
6. శ్రుతము (2)
7. ముంజేతి. అద్దమెందుకు? (3)
9. ఎప్పటిలోనని అర్థం? (2)
13. మందూకమా? (2)
15. ఒకప్పటి నాటకానికెంతపేరో? (4)
16. ఓనరు (4)
17. మతిదున్నకుబుతుక వచ్చున్నకవి (3)
21. కోరిక (3)
22. ముఖ్యం (3)
24. తప్పు జరలు బ్యాంకు సంబంధంగా ఇచ్చేది - క్రింద నుంచి (2)
25. ఎక్కువ (3)
26. వరలిపెట్టు (3)
28. సంతోషం (3)
30. కాపాడు (2)
34. కృష్ణుడి మేనమామ (3)
36. రాజీవం (3)
38. హాస్యకన (3)
39. సువాసన (4)
42. సుదటికోసలో 'ం' మాయం (3)
44. ర్యాత. చీకటి (3)
45. గోరువంక (3)
46. పుత్రి (3)
48. అరవి (2)
49. చిగురు (2)

**అడ్డం**

1. రామకోటి దీనితో ప్రారంభం (3)
3. సముద్రం (3)
5. అడవులలో వుండే వారి లక్షణం (4)
8. నడిచే త్రోవ (4)
10. పోస్టు - అటు నుంచి (2)
11. అటు నుంచి చూచి
12. గొప్పలు చెప్పడాన్ని ఇలా కొట్టడ మంటారు (3)
14. వేసవిలో ఈ చింతకాయలు ప్రసిద్ధి (6)
17. వెళ్లరా? (2)
18. సత్యం (3)
19. వ్రాసేది (2)
20. స్త్రీ (3)
23. దాగుకాను (2)
25. శాశ్వతం కానిది (4)
27. తోక (3)
29. రైలు (2)
31. ఉయ్యాల (2)
32. హరిణం (2)
33. గొయ్యి (3)
35. పగ - అటు నుంచి (2)
37. పాముకుబుసం విడిచిపోయి వుంది (3)
40. విడవకుండా వానకురవడం (3)
41. లుకలుకలో తొలి సగం (2)
43. ఎముగు - ఆ వైపు నుంచి (2)
44. అలివి మాలిన కోరిక (2)
45. నాణేలు అమ్మి వేసే వేలు గందరగోళమైంది (4)
47. పొలాల్లో కాలువ నీళ్లకు అడ్డుకట్టు (3)
49. లేని తనం (2)
50. ప్రక్కన (2)
51. గీతం (2)
52. శ్రీమతి. తెరా (3)
53. 36 అర్థమే మరో రకంగా (3)



అరణ్యం చిత్రంలో నారాయణమూర్తి, చిత్ర దర్శకుడు రవిరాజా పినిశెట్టి

# వినీతను కరిచిన చేప!

"ఇంట్లో ఇల్లాలు - వంటింట్లో ప్రియురాలు" చిత్రంలో వెంకటేష్ సరసన నటిస్తున్న వినీత ఒక విషయం చెప్పింది. "ఇటువైన చెరువుల్లో జలకాలాడే సీన్లలో నటించ కూడదను కున్నాను. సెక్సీగా కనిపిస్తానని కాదు. అసలు ఏమి జరిగిందంటే - ఈ మధ్య అటువంటి సీన్ ఒకటి తీశారు. దాదాపు గంటకు పైగా నేను నీళ్లల్లోనే ఉండి పోవలసి వచ్చింది. షూటింగ్ జరుగుతున్న సమయంలోనే ఒక పెద్ద చేప నా తొడను కరిచింది. విదిలించుకొని గాభరాతో బయట పడ్డాను. అది కొరికిన చోట ఒకటే రక్తం... అలా స్రవిస్తూనే ఉంది. కాస్సేపటి వరకు గాయానికి పై భాగాన కింది భాగాన గట్టిగా కట్టు కట్టేసరికి రక్తం ఆగింది. అప్పుడే అనుకున్నాను - ఇటువైన ఇటువంటి సీన్లలో నటించ కూడదని" అందామె.

## మద్రాసు సినిమా వార్తలు

### ఖుష్బూ తమ్ముడి సరసన నగ్మా చెల్లెలు

అమితాబ్ బచన్ సంస్థ తమిళంలో "ఉల్లాసం" అనే చిత్రం నిర్మిస్తోంది. ఖుష్బూ తన తమ్ముడు అబ్దుల్లాను హీరో చేసే ప్రయత్నాలు ఇంత కాలానికి ఫలించాయి. "ఉల్లాసం" చిత్రంలో అబ్దుల్లా సరసన నగ్మా చెల్లెలు రాధిక నాయిక. ఇద్దరూ కొత్త వాళ్లతో తీయడం సాహసం కదా? అని అడిగితే అమితాబ్ బచన్ కార్పొరేషన్ ప్రతినిధి ఇక్కడి నిర్మాతలకు- ఇది సాహసమే కావచ్చు. కాని, అమితాబ్ బచన్ కార్పొరేషన్‌కు ఇది ఏ మాత్రం సాహసం కాదు. కథ అంత పకడ్బందీగా తయారైంది అన్నారు.

### భారతీయుడులో కమలహాసన్

ఇండియన్ తమిళ చిత్రం షూటింగ్ ప్రదేశంలో కమల హాసన్ వృద్ధ గెటప్‌లో కనిపించే సరికి "బండిట్ క్వీన్" దర్శకుడు శేఖర్ కపూర్ ముక్కున వేలేసు కున్నారు. "అరే! హాలీవుడ్ నుంచి రప్పించిన మేకప్ మెన్‌లు మీ ముఖాన్ని ఎంతగా మార్చేశారు? మీ మేకప్ ఎవరినో పోలినట్లు ఉందండి" అని శేఖర్ కపూర్ ఆలోచించ సాగారు. ఆయన కాస్టే క్రమ ఇవ్వక - ప్రముఖ తత్వజ్ఞాని జిడ్డు కృష్ణమూర్తి గారి పోలిక లున్నాయా? అన్నాడు కమల హాసన్. ఇతను శేఖర్ కపూర్ దర్శకత్వం వహించే ఒక హిందీ చిత్రంలో నటించ నున్నాడు.

### నటి మంజుల కుమార్తె వనిత

కోడి రామకృష్ణ దర్శకత్వం వహించే "దేవి" చిత్రంలో నవీన్ వడ్డే సరసన ప్రేమ, మరో కథా నాయికగా నటి మంజుల కుమార్తె వనిత బుక్ అయ్యారు. ఒక నల్లత్రాచుకు కూడా ప్రముఖ పాత్ర ఉంటుంది. తాంత్రిక ఛాయా గ్రహణంలో ఆరితేరిన నెల్లూరీయుడు పి.ఎస్. ప్రకాష్‌ను కెమెరా మెన్‌గా నియమించారు. ఈ చిత్రానికి సంభాషణల కర్త సత్యమూర్తి పదహారేళ్ల కొడుకును సంగీత దర్శకుడుగా ఎంపిక చేశారు. తెలుగుతో పాటు తమిళంలో కూడా తయారయ్యే ఈ చిత్రాన్ని విజయ దశమికి విడుదల చేయదలచినట్లు నిర్మాత ఎం.ఎస్. రాజా చెప్పారు. హిందీ, మలయాళ భాషల్లో కూడా డబ్ చేయాలను కుంటున్నారు.

# ప్లేబాయ్ పత్రికకు నగ్నంగా ఫోజులిచ్చిన మమతా కులకర్ణి!

బొంబాయిలో మమతా కులకర్ణిని కొన్ని బొంబాయి పత్రికలు ఎంత ఎక్కువగా చూపాలో అంత ఎక్కువగా చూపాయి. కాని "ఆ పత్రికలు నా అంద చందాలను ఏమంత ఎక్కువగా చూపాయి? ఇంకా బాగా చూపడానికి వీలు లేక పోలేదు" అంటూ తార తన ఉద్దేశాన్ని తెలియ జేసింది. ప్లేబాయ్ అనే అమెరికా నుంచి వెలువడే పత్రిక ఆమెను ఫోటోలు తీయడానికి ప్రత్యేకంగా ఒక ఛాయా గ్రాహకుడ్ని బొంబాయికి పంపించింది. ఆ ఛాయ గ్రాహకుడు మరింత ముందంజ వేసి, ఆమెను ఇది వరకెన్నడూ తీయనంత సెక్సీగా తీశారు. ప్లేబాయ్ పత్రికలో ఆ వర్ణ చిత్రాలు ప్రచురిస్తూ "కామ సూత్రాలకు జన్మ స్థానమైన భారతావనిలో అపర మోహిని" అని హెడ్డింగ్ పెట్టారు. ఖండాంతర ఖ్యాతి వస్తుందనే దురాశతో మమతా కులకర్ణి అంత చవక బారు తనానికి దిగజారి పోయింది?

### సంగీత దర్శకుని పై కేసు

"ముత్తు" చిత్రంలోని రెండు పాటల బాణీలను తాతినేని రామారావు దర్శకత్వంలో ఒక హిందీ చిత్రంలో యథా తథంగా కాపీ చేసి నందుకు మ్యూజిక్ డైరెక్టర్ నదీమ్ సరవణలపై చిత్ర నిర్మాత కె. బాల చందర్ కేసు పెట్టారు.

### నగ్మా కాలింగ్ బెల్

మద్రాసులో నగ్మా ఇంటి ముందు జపాన్ నుంచి తెప్పించిన ఒక విచిత్రమైన కాలింగ్ బెల్ ఉంది. స్విచ్ నొక్కితే హాలులో ఒక పాపాయి బొమ్మ తమాషాగా నవ్వుతుంది. ఆగంతకులు హాలులోకి అడుగెట్టే వరకు అది నవ్వు ఆపదు. "లోపలకువచ్చే వారు సంతోష కరమైన వార్తనే తీసుక రావాలని నా అభిలాష. అందుకే ఆ బొమ్మ నవ్వు కూడా; దీని వెల ఎంతని నన్ను అడక్కండి; ఏడుస్తూ జవాబు చెప్పవలసి వస్తుంది" అంది నగ్మా నవ్వుతూ.

### కొన్ని రిజిష్టరయిన చిత్రాల పేర్లు

వైశాలి ఫిలిమ్స్ "ఆరు ముళ్లు", హరినాథ్ ప్రొడక్షన్స్ "అల్లరి రాయుడు", టిల్లణ మూవీస్ "ఐడియల్", దుర్గేశ్వరి ఫిలిమ్స్ "జయ-సూర్య", శ్రీ బాలాజీ సినీ ఎంటర్ ప్రైజస్ "కోనసీమ మొనగాడు", శ్రీ లక్ష్మి సాయి పిక్చర్స్

కొరవ 11 పేజీలో

# ఎస్ గోపాల రెడ్డి తమిళంలోకి వెళ్లారు!

చిత్ర నిర్మాణ వ్యయం విపరీతంగా పెరిగి పోవడంతో పెద్ద హీరో హీరోయిన్లతో తీసే చిత్రాల సంఖ్య తగ్గింది. చాలా మంది నిర్మాతలు కొత్త తారాగణంతో తీయాలని తలపోస్తున్నారు. పరిశ్రమ మూసివేతకు పరిస్థితులు దారి తీస్తాయేమోనని భయపడు తున్న వారూ లేకపోలేదు. ఈ పరిస్థితుల్లో తెలుగులో చిత్రాలు తీయడం కన్నా కాస్త మెరుగ్గా ఉన్న తమిళ సినిమా రంగంలో ప్రవేశించ డానికి కొందరు కుతూహల పడుతున్నారు. భార్గవ్ ఆర్ట్ పిక్చర్స్ ఎస్. గోపాల రెడ్డి తెలుగులో 14 చిత్రాన్ని నిర్మించాక, ఇప్పుడు తొలిసారిగా తమిళంలో ఒక చిత్రం తీయడానికి ఏర్పాట్లు చేస్తున్నారు. ప్రభుదేవా తమ్ముడు హీరో. కోడి రామకృష్ణ దర్శకుడు.

## పాత కంపు కొడుతున్న కథ, చౌకబారు సన్నివేశాలు

# మా ఆ.. ఆవిడ కలెక్టర్

**చిత్రసమీక్ష**
గిద్దలూరు గోపాలరావు

మా ఆ... ఆవిడ కలెక్టర్ అనే చిత్రం పేరు నత్తి వున్న వాళ్లు ఉచ్చరించినట్టుగా వుంది. పేరులో వున్న తడబాటు కథకూ సంక్రమించింది. ఈ చిత్రాన్ని నిర్మించిన అమ్మా ఆర్ట్ యూనిట్ కథ తయారు చేసింది. కథలో ఎక్కడా కొత్త దనం కనిపించదు. ఇంత వరకు ఎన్నో చిత్రాల్లో చూసిన సంఘటనలను జత చేసి కథ కూర్చ బడింది. కథలో వచ్చే పాత్రలు కూడా పాతవే. అందుకే చిత్రమంతా పాత వాసన కొడుతూ వుంది.

కార్ మెకానిక్‌గా పనిచేస్తున్న రాజాను (జగపతి బాబు), ఇందిర (ప్రేమ) అనే జమీందార్ల అమ్మాయి పెళ్లి చేసు కుంటుంది. రాజాకు చదువు రాదు. రాజా మొదట్లో ఒక అనాథ బాలుడు. ఒక స్వాతంత్ర్య సమర యోధుడు (పోకల నరసింహ రావు), రాజాను పెంచి పెద్ద చేస్తాడు. అతడ్ని మంచి కుర్రవాడుగా మలుస్తాడు. అతనికి రోజూ పత్రిక చదివి వినిపించి, చదువుకున్న వారి కెవరికీ తీసి పోనంత లోక జ్ఞానంతో తీర్చి దిద్దుతాడు. మనవడు, తాతా చాలా కలుపు గోలుగా, చిలిపిగా వ్యవహ రిస్తుంటారు. తెలివిగల అమ్మాయిని పెళ్ళి చేసుకోమని రాజాకు తాత సలహా యిస్తాడు. కాని రాజా చదువు సంధ్య లేని వాడు కాబట్టి, తన కంటె కాస్త తక్కువ స్థాయిలో వున్న అమ్మాయిని చేసుకో దలుస్తాడు.

రాజా, తన తాతతో కలసి ఒక కాలనీలో కాపుర ముంటాడు. ఫ్యాక్టరీ నిర్మాణం కోసం, ఆ స్థలం కొనేందుకు పార్వతి (లక్ష్మి) అనే జమీందారిణి తన మంది మార్బలంతో వస్తుంది. రాజా వారినంతా తన్ని తరుముతాడు. జమీందారిణి కూతురు ఇందిర, తన తల్లి తెచ్చిన సంబంధాలను కాదని, మానవతా దృక్పథంతో మంచి పేరు తెచ్చుకున్న రాజాను పెళ్ళి చేసుకో నిర్ణయి స్తుంది. తాత సలహాతో ఇందిర తన జమీందారీ హోదాను వదలి, రాజా కంటె తక్కువ స్థాయికి దిగి అతడ్ని పెళ్ళికి ఒప్పిస్తుంది. పెళ్ళి జరిగే సమయానికి జమీందారిణి అడ్డు తగులుతుంది. ఇందిర జమీందారిణి కూతురని తెలుసుకున్న రాజా ఆమెను అసహ్యించు కుంటాడు. ఆ తర్వాత మనసు మార్చుకున్న రాజా నేరుగా ఇందిర ఇంటికి వెళ్లి జమీందారిణి సమక్షంలో ఆమె మెడలో తాళి గడ్తాడు. ఇందిరను ఇంటికి తీసుకొచ్చు కుంటాడు. రాజాతో పెళ్ళయిన తర్వాత ఇందిర కలెక్టర వుతుంది. తనకు ఇష్టం లేని పెళ్ళి చేసుకున్నందుకు జమీం దారిణి ఇందిర దాంపత్యాన్ని విచ్ఛిన్నం చేస్తుంది. రాజా మీద చెడ్డ ప్రచారం చేయిస్తుంది. వాటిని నమ్మిన ఇందిర భర్తను వదిలేసి పుట్టింటికి వస్తుంది. నిదానంగా అసలు

కొరవ 11 పేజీలో

# రాయి-తురాయి

## తండ్రి పదవికి తద్దినం పెట్టిన హరికి వారసత్వపు వాచాలత్వం తగునా?

## సిట్ల బేరంలో చిక్కిన "దాస్‌కేపిటల్"

వింతలేను గొంటూ ఎలుగెగ పోతున్నది. 'వారసత్వపు' వింత పాట; ఈ రోకటి పాటకు వంత పలుకుతూన్న పత్రికల భట్రాజ గణాన్ని చూస్తుంటే మరీ రోత కలుగుతూంది. తలతిక్క మాటలకు తలఊపే వాళ్ల వెర్రి; తల తోసుకొనే వాళ్ల తిక్క వేరు.

చంద్రబాబు తానే ఎన్టీఆర్‌కు తగిన వారసుణ్నని తెగ బల్ల గుద్దుతున్నాడు. దీనికి వెంకటేశ్వరం రావు పదేపదే వొప్పుకోదు. హరికృష్ణ సరేసరి వారసత్వపు ఊత కర్రను వదిలి పెట్టడం లేదు. లక్ష్మీపార్వతి కొంగు బిగించి, తీక్షణ వీక్షణాగ్ని కణాలను పరిపంథుల పై రువ్వుతూ - తానే సిసలైన వారసు రాలిన తగేసి చెబుతూంది; పిండి తార్థం ఏమిటంటే - ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం-

వారసత్వపు చురుపు ముక్కను వాటం చూసి విసురు తున్నారు; చెప్పరోడానికి తమకంటూ సొంతం ఏమీ లేదాయె!

హరికృష్ణ వాగుడుకు, మరీ హద్దూ, పద్దూ లేకుండా పోయింది. వారసత్వపు తీట వొళ్లంతా వ్యాపించిందేమో - ఒకటే పలుకుడు! అతనికి తెలిసినవి రెండే రెండు విషయాలు. అవి నాతుదే అన్న అనుకంప లేశమైనా లేకుండా లక్ష్మీపార్వతిని ఆడి పోసుకోవడం! తన తిట్లన్నీ ఆమెకు దీవనలై ఒట్ల రూపంలో ఆమె ఒడిలో జలజల రాలి పొయ్యే ప్రమాదాన్ని గుర్తించ గలిగే వివేకం ఆయన కున్నట్లు లేదు.

రెండవది - వారసత్వపు తొప్పెట పై దరువులు వేస్తూ, శివమెత్తి చిందులు తొక్కడం - ఇవి రెండే అతడు నేర్చిన విద్యలు. ఒక స్త్రీ పై పగం తొప్పిన విద్వేషం, రక్కసి వంటి కసి - ఈ రెండు దుర్గుణాల పూనకంతో ఊగి పోతున్న మనిషికి మంచి చెబ్బరల మర్మం, ధర్మం తెలియక పోవచ్చు.

### అగ్నిమిత్ర

*కల్లుళ్లకు అరణం!*
*భార్యకు భరణం!*
*ముద్దుల కొడుక్కి మారుగట్టిన ముడుపు!!*

ఇది మన తెలుగు తల్లి దీనస్థితి; నీచాతి నీచమైన పరిస్థితి. ఆరు కోట్ల ఆంధ్రులు తలకు మించిన తమ పరువు బరువుకు తట్టుకోలేక తలలు దించు కోవలసిన దురవస్థ తటస్థమై నందుకు నవ్వాలో, ఏడ్వాలో ?

మనది ప్రజాస్వామిక వ్యవస్థ; వారసత్వానికి ఇందులో చోటు లేదు - ఉండదు. ప్రజలు తమకు నచ్చిన వాళ్లను ఎన్నుకొంటారు; తాము మెచ్చని వాళ్లను తోసేస్తుంటారు; ఏ తావాతా - పై చేయి ప్రజలదే. రాజకీయ వాదులది ఎప్పుడూ 'కింద చెయ్యే' - ఓట్లు యాచించే టప్పుడు. సీట్ల పై కూర్చున్న తర్వాత కూడా.

అల్లుళ్లు ఒక పంచ, భార్య మరొక చెంప, వీళ్లందరినీ తలద న్నేటట్లు హరికృష్ణ వేరొక పక్క

అయినా, తండ్రి పదవిని ఎసురు కుండ పై కెక్కించిన సుపుత్రుడు వారసుడని విర్ర వీగడం చిత్రంగా లేదూ? వనితలు వల్ల కాటికి రాకూడదన్న హైందవ ధర్మ సూత్రాన్ని ఉటంకించి లక్ష్మీపార్వతిని ఆటంక పరిచిన హరికృష్ణకు, తండ్రి విషయంలో హైందవ ధర్మ సూక్ష్మాలు తెలియక పోవడం విడ్డూరం. కడుపు గట్టిన స్వార్థానికి కళ్లుండవు; కనికరం అసలుండదు.

తల్లి, తండ్రి, గురువు, దైవం ఈ నలుగురూ పూజార్హులని హిందూ ధర్మ శాస్త్రాలే కాదు - బైబిల్, ఖురాన్‌తో సహా అన్ని మత ధర్మాలూ ఉద్ఘోషి స్తున్నాయి. మరి అట్టి పూజనీయుడైన తండ్రికి హరి చేసిన పూజ ఎటువంటిది? బావ చేతిలో పావుగా మారి తండ్రి ముఖ్యమంత్రి

కొరవ 8

# జిల్లావార్తలు

## చంద్రబాబు సభ తుస్...

మిత్ర పక్షాల అభ్యర్థి టిపి. భానురాజాకు మద్దతుగా ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడు 25 తేది. ఆత్మకూరులో నిర్వహించిన బహిరంగ సభ అట్టర్ ఫ్లాఫ్ అయ్యింది. ఆశించినంత మంది జనాన్ని తరలించడంలో ఎమ్మెల్యేలతో పాటు మిత్ర పక్షాల నాయకులూ విఫల మయ్యారు. 40 వేల మందిని సభకు తరలిస్తామని ముందు గాంభీర్యాలు పలికిన ఎమ్మెల్యే కనీసం 4 వేల మందిని కూడా తరలించ లేక పోయారు. తన ఉపన్యాసానికి ప్రజలు కూడా సరియైన రీతిలో స్పందించక పోవడంతో చంద్రబాబు నాయుడు ఖిన్నుడై పోయారు. ఎవరికి ఓటేస్తారని నాలుగైదు సార్లు ముఖ్య మంత్రి సభలో ప్రశ్నించగా - ప్రజల నుండి సమాధానం లేక పోవడంతో; ఎండ వల్ల మీరంతా అలసి సొలసి వున్నారని గమనించానని అందువల్లే మీరు సమాధానం చెప్పలేక పోతున్నారని ప్రకటించి తనకు తానే సర్దుకు చెప్పుకొన్నారు. కేవలం 20 నిమిషాల్లో తన ఉపన్యాసం ముగించారు. ప్రస్తుతం కాంగ్రెస్ పార్టీ నాలుగు ముక్కలై వుందని ఎన్నికల తరువాత మరిన్ని ముక్కలు కాక తప్పదని చంద్రబాబు నాయుడు చెప్పారు. కేంద్రంసంకీర్ణ ప్రభుత్వం ఏర్పడడం ఖాయమని జోస్యం చెప్పారాయన. పుద్యమాలకు పుట్టి నిల్లైన నెల్లూరు జిల్లాలో మిత్ర పక్షాల అభ్యర్థిని గెలిపించేందుకు మహిళలు ప్రతిన బూని టిపి భానురాజాను గెలిపించాలని విజ్ఞప్తి చేశారు. మార్కెటింగ్ మంత్రి రమేష్ రెడ్డి, ఎమ్మెల్యేలు లక్ష్మయ్య నాయుడు, చంద్ర మోహన్ రెడ్డి, కంభం విజయ రామిరెడ్డి, జక్కా వెంకయ్య, అభ్యర్థి టిపి భానురాజా సభలో మాట్లాడారు.

### పార్వతమ్మ తల్లిలా ప్రజలను ఆదరిస్తారు!

సినీ నటి విజయ శాంతి, ఒంగోలు కాంగ్రెస్ అభ్యర్థి మాగుంట పార్వతమ్మకు అనుకూలంగా ప్రచారం చేయను 23, 24 తేదీల్లో ఉదయగిరి, దుత్తలూరు, కనిగిరి, మర్రిపాడులతో పాటు కావలికి విచ్చేసారు. ఆమె పర్యటనకు మంచి స్పందన లభించింది. భారీ సంఖ్యలో ప్రజలు విచ్చేసారు.

### ఆత్మకూరులో ముఖ్యమంత్రికి నిరాదరణ

కావలి సభకు విచ్చేసిన జనాన్ని చూసి హుషారుగా మాట్లాడారామె. కానీ సినిమాల్లో ఆమె గొంతుకు, మాట్లాడే గొంతుకు తేడా పై పలువురు చర్చించు కోవడం కనిపించింది. కొందరు నాయకులు ప్రభుత్వ ధనాన్ని తమ జేబుల్లో నింపు కొనేందుకు రాజకీయాల్లోకి వస్తే; మాగుంట కుటుంబీకులు స్వంత ధనాన్ని ప్రజా సంక్షేమం కోసం వినియోగి స్తున్నట్లు చెప్పారు. తనకు ఏ పార్టీతోనూ సంబంధాలు లేవని, స్వర్గీయ సుబ్బరామ రెడ్డి ఆశయాలు, కార్యక్రమాలు కొనసాగిస్తారన్న నమ్మకంతో పాటి ఆదరానిగా పార్వతమ్మ విజయానికి కృషి చేస్తున్నట్లు వివరించారు. పార్వతమ్మ తల్లిలా ప్రజలను ఆదరిస్తారని, బిడ్డలు పడే బాధ తల్లికే తెలుస్తుందని విజయ శాంతి అన్నారు. పార్వతమ్మకే ఓట్లు వేస్తారా అని ప్రశ్నించి, వేస్తామన్న హామీని ప్రజల నుండి పొందారామె. విజయ శాంతి వెంట పార్వతమ్మ గారు ఈ పర్యటనలో

కొరవ 7 పేజీలో




ఆత్మకూరులో జరిగిన బహిరంగసభలో ప్రసంగిస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు.

## సారా స్మగ్లర్ల కోసమా ఎమ్మెల్యే శ్రమపడేది?

ఇక మూడు నెలల్లో రాపూరు ఎమ్మెల్యే ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి పంచరై పోయిన సైకిల్ భుజాన్నెత్తుకొని వెన్నూరుకు పయనం కాక తప్పదని మాజీ ముఖ్య మంత్రి నేదురుమల్లి జనార్దన రెడ్డి జోస్యం చెప్పారు. 19 తేది రాపూరు పాత బస్టాండులో జరిగిన కాంగ్రెస్ పార్టీ బహిరంగ సభలో మాట్లాడుతూ ఎల్లసిరి గెలిచాక నియోజక వర్గ అభివృద్ధికి పాటు పడకుండా సారా, బ్రాంది స్మగ్లర్లకు తోడ్పడు తున్నారని. గ్రామాల్లో కక్షలు రేపి పోలీస్ స్టేషన్లతో పరిమితమైనారని విమర్శించారు. లక్ష్మీపార్వతికి పంచెంట్లో కానుకలిచ్చి, ఎన్టీఆర్ ఫోటో పెట్టుకొని గెలిచిన మనిషి మళ్లీ ప్రజలకే కనపడ లేదని ఈ ప్రాంతీయులు నాకు స్వయంగా చెప్పారు. రాపూరు ఓటర్లు సత్తా వున్న వాళ్లు; గతంలో పద్మశ్రీ గెలుపుకు మారే కారకులు; పనబాక లక్ష్మి పై విశ్వాసం వుంచి అప్పుడూ ఓట్లేయమని కోరారాయన. మాజీ శాసన సభ్యుడు ఆనం రామనారాయణ రెడ్డి మాట్లాడుతూ 1962 నుండి 95 వరకు ఎన్ని పోలీసు కేసులు రాపూరు స్టేషన్‌లో నమోదయ్యాయో ఈ ఒకటిన్నర సంవత్సరంలో నమోదైనట్లు చెప్పారు. ఆనం వివేకానంద రెడ్డి, పిపి శేషారెడ్డి, మండలాధ్యక్షుడు పాపకన్ను రాజశేఖర రెడ్డి, పార్లమెంటు అభ్యర్థిని పనబాక లక్ష్మి కూడా ఈ సభలో పాల్గొన్నారు.

### రాపూరు సభలో ఎల్లసిరి పై విసురు!

### కవితలు పంపండి

బుచ్చిలోని శారదా నికేతన్ జూన్ నెలలో తెలుగు సౌరభాలు అనే అంశం పై కవి సమ్మేళనాన్ని నిర్వహిస్తుంది. ఆసక్తి గల కవులు మే 15 తేదిలోగా పై అంశం పై చంటోబద్ధ కవితను అధ్యక్షులు, శారదా నికేతన్ బుచ్చి రెడ్డిపాలెం - 524 305 చిరునామాకు పంపమని కోరుతున్నారు.



కావలిలో కాంగ్రెస్ తరఫున ప్రచారం చేస్తున్న సినీ నటి విజయశాంతి, పి.వి. ప్రసన్నరెడ్డి; ఆమెను చూడడానికి ఎగబడిన జనసందోహం.

# పోరు హోరాహోరీగా వున్నా చివరకు పార్వతమ్మనే వరించనున్న విజయం?

ఒంగోలులో ఎన్నికల పోరు, ప్రచార పోరు తారాస్థాయి నందుకున్నాయి. రెండు మత్త గజాల మధ్య పదవి తాయిలం ఎవరికి దంచాలో; ఎవరికి పంచితే ఏమి తంటానోనని ఓటరు దిత్తరపోయే పరిస్థితి వుందక్కడ. మాగుంట సుబ్బరామ రెడ్డి గారి మరణపు సానుభూతితో బ్యాలట్ పెట్టెలు నింపు కోవడానికి పార్వతమ్మ ప్రయత్నిస్తుంటే; తన పై పడిన అదే మరణపు నిందను మాపు కోవడానికి రాజమోహన రెడ్డి చావు బ్రతుకుల పోరాటంగా తలపడు తున్నారు.

**యాతన పెట్టినా యానాది రెడ్డి తెచ్చే ఆధిక్యతే వూపిరి నిల్పుతూంది!**

**కొండప నాయుడు కాంగ్రెస్‌తో రాజీ చేసుకున్నారా!**

**ఉదయగిరిలో మాత్రం కాంగ్రెస్ పప్పులుడకవు**

విజయం సాధించి వుండాలి; ఆ గెలుపూ చాలా ఘనతరంగా వుండి వుండాలి; లక్ష, రెండు లక్షల మెజారిటీ వచ్చి వుండాలి; పద్దంటే ఓట్లు వచ్చి వుండాలి; తిరగకుండానే గెల్చి వుండాలి. నామినేషన్ల సమయానికి పరిస్థితి అట్లనే వుండింది; కాని రాను రాను మారిపోయింది. దీనికి తగ్గట్టు కాంగ్రెస్ అభ్యర్థిని సైతం తమ ప్రచార ఉధృతి పెంచబట్టి సరిపోయింది కాని లేకుంటే ప్రమాదం జరిగి పోయి వుండేది.

అయితే పోరు ఎంత హోరా హోరీగా జరిగినా చివరకు విజయం ఆమెనే వరించ వచ్చునని చెప్తున్నారు. రాష్ట్ర మంతటా కాంగ్రెస్ గాలి వీస్తున్నప్పుడు ఇక్కడ మాత్రం ఎందు కుండదు? పార్వతమ్మ గారి గెలుపు ప్రధానంగా కావలి, కందుకూరులలో వచ్చే ఆధిక్యతే సహకరించ వచ్చునన్నది అంచనా. శ్రీ కలికి యానాది రెడ్డి మొదట మొదట ఏడ్పించినా, యాతన పెట్టినా

కావలి తర్వాత, కాంగ్రెస్‌కు అత్యధిక ఆధిక్యత తెచ్చి పెట్టే నియోజక వర్గం - కందుకూరు. మాజీ ఎమ్మెల్యే శ్రీ మహీధర్ రెడ్డి తన వ్యక్తిగత ప్రతిష్ఠను పణంగా పెట్టి ప్రచారం నిర్వహి స్తున్నారు. అక్కడి తెలుగు ఎమ్మెల్యే అన్‌పాపులర్ కావడంతో మహీధర్‌కు సుకరంగా వుంది. ఉదయగిరిలో కాంగ్రెస్‌కు ఏర్పడే లోటును యానాది రెడ్డి గారు పూడుస్తుంటే, కనిగిరిలో వచ్చే కొరతను మహీధర్ రెడ్డి తీరుస్తున్నారు.

పని కాదు. కాని, ఒంగోలు సాధారణంగా కాంగ్రెస్ పార్టీకి బలమైన స్థానం. చీసిలు ఎక్కువ. వారిలో గత ఎన్నికల నాటి తెలుగు దేశం భ్రమలు వుండడానికి లేదు. వారిలో మార్పు స్థిరపడితే కాంగ్రెస్‌కు ఆధిక్యత కష్టం కాదు.

సంతనూతల పాడు, ఉదయ గిరిలలో మాత్రం కాంగ్రెస్ అభ్యర్థిని కష్టాల కడలిలో ఈదు తున్నారు. ఉదయగిరి రాజమోహన రెడ్డి స్వస్థలం కాబట్టి అక్కడ సమస్య బెదురు కావడం అర్థం చేసుకోవచ్చు; కాని సంతనూతల పాడులో కాంగ్రెస్ పట్ల అంత వ్యతిరేకత ఎందుకు వస్తున్నదో అర్థం కావడం లేదు. అక్కడ కాంగ్రెస్‌కు సరైన నాయకత్వం లేక పోవడం ఒక కారణమైతే, సిపిఎం చాలా బలంగా వుండడం రెండవ కారణం కావచ్చు.

ఇటువంటి పరిస్థితుల వల్లే రాజమోహన రెడ్డి అంత ధైర్యంగా వున్నారు. ఉదయగిరి, కనిగిరి,

కొండప నాయుడు ఆయనకు పెద్ద చిక్కు ప్రశ్న. ఆయన దయతలిస్తే - తెలుగు దేశానికి మంచి బలం చేకూరుతుంది. కాని ఆయనిప్పుడు సింహం ఎక్కి వున్నారు. పోటీ తీవ్రత వల్ల అది కేవలం గ్రామ సింహంగా మారింది కాబట్టి, ఆ ఓట్లు తన సైకిల్‌కు వేయించమని రాజమోహన రెడ్డి అడిగినా, నాయుడు గారు మాత్రం ఒప్పుకున్నట్లు లేదు. ఎంత వరకు నిజమో కాని ఆయన కాంగ్రెస్‌తో రాజీ పడ్డారని; ఓట్ల చీలికను సహక రిస్తానని మాట ఇచ్చారని చెప్తున్నారు. కలిగిరి,

**కనిగిరి లోపం కందుకూరులో మహీధర్ రెడ్డి తీరుస్తున్నాడు**

**సంతనూతలపాడులో అంత వ్యతిరేకతా?**

**ఒంగోలు టౌన్ దయతలిస్తేనే మాగుంటకు విజయావకాశం!**

# తెలుగు ' ట్ల చీలికే రాజమోహన రెడ్డికి శాపం?

ఇద్దరి మధ్యా ఎన్నికల స్పర్థ వ్యక్తిగత స్థాయికి వెళ్లి పోవడంతో నియోజక వర్గంలోని పలు ప్రాంతాలలో పరిస్థితి ఉద్రిక్తంగా వుంది. రేపటి పోలింగ్ ప్రశాంతంగా జరుగు తుందా అన్న సందేహం తలెత్తుతూ వుంది.

ఒంగోలులో ఈ పరిస్థితి ఏర్పడడం విచిత్రం. సుబ్బరామ రెడ్డి గారి సానుభూతి పవనాలు, కాంగ్రెస్ పట్ల రాష్ట్రమంతా వున్న సానుకూలత, అభ్యర్థినిగా కొత్త దనం కల్గి వుండడంతో పార్వతమ్మ గారు చాలా సులభంగా

ఆ తర్వాత వయస్సు బాధలు మర్చి పోయి పనిచేశారు. ఇటు టౌన్‌లో, అటు పల్లెల్లో కూడా కాంగ్రెస్ గెలుపు కోసం కష్ట పడుతున్నారు.

యానాది రెడ్డి గారి ఎన్నికల రాజకీయ మంతా కేవాసు గ్రహమే. కొన దాకా కష్టంగా, కటకటగా కన్పిస్తుంది; తీరా పోలింగ్ రోజుకి సుఖాంత మౌతుంటుంది. ఇప్పుడూ అంతే కావచ్చు. అయితే ఈసారి ప్రధానంగా ఆయన కుల పరమైన విభజనను - పడమటి పల్లెల్లో ఎదుర్కొం టున్నారు. అదేమీ చిన్న సమస్య గాదు. కానీ ఇటువంటి చిక్కులకు చిట్కా మంత్రాలు వేసివే విద్య యానాది రెడ్డి గారికి బాగా తెలుసు.

కనిగిరి కాంగ్రెస్‌కు చాలా సమస్యగా వుంది. తిరుపతి నాయుడు గారు చాలడం లేదు. కుల పరంగా ఆయన వారంతా చంద్రబాబు ప్రక్క చూస్తుండడంతో పాటు, రెడ్ల దృష్టి పాకనాటి సూత్రం వైపుకు ఆకర్షింప బడుతుండడంతో కటకటగా వుంది పరిస్థితి.

అయితే కొండపిలో మాత్రం కాంగ్రెస్ బాగా వుంది. ఇక్కడ కొద్దిగా ఆధిక్యత వచ్చినా రావచ్చు. ఒంగోలు టౌన్‌లో పది, పదిహేను వేల మెజారిటీ తెచ్చుకో గల్గితే పార్వతమ్మ గారి గెలుపు ఖాయ మౌతుంది. గత అసెంబ్లీ ఎన్నికలో ఇక్కడ కాంగ్రెస్‌కు 20 వేల ఓట్ల లోటు ఏర్పడింది. ఇంత పెద్ద ఖాళీని భర్తీ చేసి, ఆ పైన మెజారిటీ తేవడమంటే చిన్న

సంతనూతల పాడులలో ఆయన సైకిల్ చాలా జోరుగా వుంది. పాకనాటి రెడ్ల అభిమానం, మెట్ట ప్రాంతీయుడన్న అనుకూలతలతో పాటు - లక్ష్మీపార్వతి అభ్యర్థి ఎటూ ఓడి పోతాడనే వుద్దేశ్యంతో కమ్మ ఓటర్లు తన వైపు చూస్తుండడంతో ఈ మూడు చోట్లా ఆయన చాలా సుఖంగా వున్నారు. మూడింటిలోనూ తనకు మెజారిటీ గ్యారంటీ అన్న విశ్వాసం కన్పడుతూంది.

అయితే కావలి మాత్రం రాజమోహన రెడ్డికి కొరుకుడు పడడం లేదు. ఒక్క వంటేరు వేణుగోపాల రెడ్డి మాత్రమే ఆయన కోసం రాత్రి పగలు పని చేస్తున్నారు. తక్కిన తెలుగు నాయకులలో ఐక్యత లేదు; ఆసక్తి లేదు.

గట్టుపల్లి, కొండా పురం ప్రాంతాలలో ఆయనకు అత్యంత ముఖ్య అనుచరులను కున్నవారు యానాది రెడ్డి పక్షంగా తిరుగు తుండడం ఈ రాజీ వార్తను బల పరుస్తూంది.

కందుకూరు, కొండపిలలోనూ రాజమోహన రెడ్డికి లోటు తప్పేట్లు లేదు. అందువల్లనే ఆయన ఓట్లు రాని కావలిలో వృథా ప్రయాస ఎందుకని ఇటు రావడం మానేసి, ఉదయగిరి, కనిగిరిలలో విస్తృత పర్యటన చేసు

కొరవ 7 పేజిలో

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Offset Printing at Nayagara Paper Products (India) Limited, Nellore